యగుసముద్రుఁడు దానికి మామగాఁ జెప్పఁబడెను, ముక్కంటి...పాది=శివునికి త్రిపురాసురులను సంహరించునపుడు తూణీరమైనవాఁడు, మింటి...నీటు కాఁడు=ఆకాశమును (అనఁగా స్వర్గమును) గుఱ్ఱపులాయముఁగాను వృక్షములతోఁటఁగాను ఆవుదొడ్డిఁగాను జేసిన నేర్పరి - స్వర్గంబునఁ గల యుచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును కల్పవృక్షములను గామధేనువును గన్నట్టివాఁ డని యర్థము. చందురయ-చంద్రునితండ్రి, లచ్చితండ్రి=లక్ష్మీదేవితండ్రి-౧౭=సముద్రుఁడు. వెల్లయేనుఁగు=తెల్లనిగజము, చాదంతి = నాలుగుదంతములు గలది, వేల్పుగారు=దేవతలగజము, మొదటిహత్తి=ప్రథమగజము-౪ = ఐరావతము. తెల్లజక్కి = తెల్లనిగుఱ్ఱము, నిక్కువీనులమావు=పొడవైనచెవులు గలగుఱ్ఱము. చదలు తేజి=ఆకాశమునందుండు గుఱ్ఱము-3 ఉచ్చైశ్శ్రవము.

సీ. వేలుపుటెంకి కోవెల దేవళము గుడి
 యనఁగ దేవాలయాఖ్యలు చెలంగుఁ
దెలిగంట్లు జన్నంపుఁదిండులు జేజేలు
 తొలివేల్పుపగతురు పలుకుటల్గు
మేటులు వేల్పులు మింటిత్రోవరులు ని
 దురలేనిప్రోడలు నరలు గనని
పెద్ద లనఁగ సురాభిఖ్య లా విన్వీలు
 వేగంటికచ్చేరి వేల్పుటెంకి
తే. యనఁగ స్వర్గముపేళ్లగు వినుమిటారు
లచ్చరలు వేల్పుచెలు లన నమరు నమర
తరుణులకుఁ జాగరతనము తలఁపుమాని
క ననఁ జింతామణిసమాఖ్య లమరు సాంబ.  18

టీ. వేలుపుటెంకి=దేవస్థానము, కోవెల, దేవళము = (ప్ర.) దేవాలయము, గుడి-౪=దేవాలయము. తెలిగంట్లు = తెలుచుకొనియుండు కన్నులు

గలవారు, జన్నంపుఁదిండుఁలు = యాగములందు హావిస్సులను భక్షించువారు, జేజేలు, తొలివేల్పుపగతురు = పూర్వదేవతలగు రాక్షసులకు శత్రువులు, పలుకుటల్గుపేటులు=మాటలె యాయుధముగాఁ గలవారు-గీర్వాణులు. వేల్పులు, మింటిత్రోవరులు=ఆకాశమున సంచరించువారు, నిద్దురలేని ప్రోడలు = నిద్రపోవుట లేనిదిట్టలు, నరలు...పెద్దలు = పలితములు (అనఁగా ముదిమి) లేని పెద్దవారు-౯=దేవతలు. విణ్ ప్రోలు=ఆకాశమునందలి పట్టణము, వేంగటికచ్చేరి = దేవేంద్రుని కొలువుకూటము, వేల్పుటెంకి=దేవతల నివాసస్థానము-౩=స్వర్గము. వినుమిటూరులు = ఆకాశమునందలి స్త్రీలు, అచ్చరలు = [ప్ర.] అప్సరసలు, వేల్పుచెలులు-౩=దేవతా స్త్రీలు. చాగరతనము = కోరినసంపదల దానము సేయురత్నము, తలఁపుమానికము=చింతామణి-౨=చింతామణి.

సీ. అడిగిన నొసఁగెడిః యావు జేజేగిడ్డి
చదలుతొడుకు తెల్లః మొద వనంగ
సురగవిపే ళ్లగుఁ ః దెఱగంటిమ్రాఁకులు
పెట్టుమ్రాఁకులు మింటిః చెట్టు లనఁగఁ
గల్పకాఖ్య లగు వేఃగంటిగొంగలు రక్క-
సులు రేయిుద్దిమ్మరుల్ ః సుకురుసిసులు
వేల్పుదాయలు తొలిః వేల్పులు నా దైత్య
నామంబు లగు గాలి ః గాము నెగడి

తే. కొఱవిరాలుపు బూచి పోఁః కుడు పిసాసి
దయ్య మనఁగఁ బిశాచాభిః ధానము లగు
నివము వలి మం చనంగను ః హిమము దనరుఁ
బిడు గనఁగఁ జెల్లు నశనికిఁ ః భేల్లు సాంబ. 19

టీ. అడిగిన నొసంగెడియావు = కోరినవాని నిచ్చునట్టిధేనువు, జేజేగిడ్డి =దేవతలయావు, చదలుతొడుకు=ఆకాశమునం దుండుధేనువు, తెల్లమొదవు=

తెల్లనియావు -ర=కామధేనువు. తెఱగంటి మ్రాఁకులు = దేవతావృక్షములు, వేల్పుమ్రాఁకులు=కోర్కు లిచ్చుచెట్లు, మింటిచెట్లు=ఆకాశమందుండు వృక్షములు-3=కల్పవృక్షములు. వేగంటిగొంగలు = ఇంద్రునకు శత్రువులు, రక్కసులు=(ప్ర) రాక్షసులు, రేయిద్రిమ్మరులు=రాత్రులందుఁ దిరుగువారు, సుకురుసీసులు = శుక్రాచార్యునిశిష్యులు, వేల్పుదాయలు=దేవతలకు దాయాదులు-లేక శత్రువులు, తొలివేల్పులు=పూర్వదేవతలు-౬=రాక్షసులు. గాలి, గాము=(ప్ర) గ్రహము, సెగడి, కొఱవిరాలుపు, బూచి, సోఁకుడు, పిసాసి = (ప్ర) పిశాచము, దయ్యము-౭ = పిశాచము. ఇనము- (రూపా. ఇగము. ప్ర. హిమము,) వలి, మంచు-3=హిమము. పిడుగు=అశని-వజ్రాయుధము.

సీ. మిన్ను చుక్కలత్రోవ ౯ విన్నుప్పరము నింగి
వెన్నునియడుగు విను ౯ వేల్పుఁదెరువు
గాలితండ్రి బయు లాకసము మొగులుతెన్ను
చదలు నా గగనాఖ్య ౯ లొదవు చుండుఁ
బవలు పగలు నాఁగ ౯ దివముపేళ్లగు రేయి
రాతిరి రే యన ౯ రాత్రి యమరు
దెస దిక్కు కడ యన ౯ దిశ యొప్పు నెల చంద
నఁగ మాస మమరుఁ బున్నమ యనంగ
తే. నలరుఁ బూరిమకు నమాస ౯ యమవస యనఁ
జను నమావాస్యపేరులు ౯ సంజ సందె
యనఁగఁ దగు సంధ్య కాతపంబునకు నెండ
ప్రొద్దు వేంద్రం బనెడిపేళ్లు ౯ పొసఁగు సాంబ. 20

టీ. మిన్ను, చుక్కలత్రోవ = నక్షత్రమార్గము, విన్ను, ఉప్పరము, నింగి, వెన్నునియడుగు=విష్ణుపదము, విను, వేల్పుఁదెరువు = దేవతలమార్గము, గాలితండ్రి=వాయువునకు జన్మస్థానము, బయలు, ఆకసము, మొగులుతెన్ను = మేఘముల మార్గము, చదలు-౧3=ఆకాశము. పవలు, పగలు-౨ = అహస్సు-

రేయి, రాతిరి, రే-3=రాత్రి. దెస = (ప్ర) దిశ. దిక్కు (ఇది సంస్కృతసమము), కడ =(ప్ర) కాష్ఠ-3=దిశ. నెల, చందు-౨=మాసము. పున్నమ=పూర్ణిమ. అమాస, అమవస-౨ = అమావాస్య. సంజ, సందె-౨ = సంధ్య. ఎండ, ప్రొద్దు, వేన్డ్రము-3 =ఎండ.

సీ. మెఱుపులు మెఱుఁగులు § మించు లనఁ దటిత్తు
లగును జుక్కలు రిక్క § లనఁగఁ దార
లమరు జేజేతేనియరదము నీటిమో
పరి మబ్బు మొయిలనఁ § బరఁగు ఘనము
తెర యల తరఁగ నాఁ § బొరయు వీచికపేళ్లు
నురువు నురుఁ గనంగఁ § గొఱలు ఫేన
మంతస్సమాభిఖ్య § లగును లోపల లోన
లోనన బహిరాఖ్య § లొప్పును వెలి
తే. బయలు వెలుపల నాఁగ దీపంబుపేళ్లు
వఱలుచుండును జోతి తిర్వాలిక దివ్వె
యనఁగ మందోష్ణమునకు వెచ్చన యొకింత
వేఁడి యిసుమంతకాఁక నా § వెలయు సాంబ. 21

టీ. మెఱపులు, మెఱుఁగులు, మించులు-3 = మెఱుపుఁదీఁగెలు. చుక్కలు, రిక్కలు=(ప్ర)ఋక్షములు-౨ = నక్షత్రములు. జేజే తేనియరదము=దేవేంద్రుని రథము, నీటిమోపరి = జలమును ధరించునది-జలధరము, మబ్బు, మొయిలు ॥రూ॥ మొయులు ॥పా॥ మొగులు ॥రూ॥ మొగిలు-౪ = మేఘము. తెర, అల, తరఁగ=(ప్ర) తరంగము-3 =అల. నురుఁగు, నురువు-౨ = ఫేనము. లోపలఁ, లోనఁ, లోఁ-3=లోపల. వెలి, బయలు ॥రూ॥ బయిలు-బైలు, వెలుపల-౫=బయలు. జోతి = (ప్ర) జ్యోతిస్సు, తిర్వాలిక (ఇది యౌగికపదము) దివ్వె॥ (రూ॥ దివ్వియ-దివియ-దీవియ-దీవె)-3 = దీపము. వెచ్చన, ఒకింతవేఁడి, ఇసుమంతకాఁక-3 =కొంచెమైన ఉష్ణము.

క. సిస్తుగ లక్షణకవి యగు
కస్తురిరంగాఖ్యుఁడను జగద్ధితముగ నీ
నిస్తులదైవతవర్గును
విస్తర మొనరించినాఁడ కే విబుధులకరుణన్. 22

తా. లక్షణము చక్కఁగాఁ దెలిసినకవిని. కస్తురిరంగనామము గలవాఁడను. పండితులదయచేత లోకములకు హితముగా నసమానమైన యీదేవవర్గును విస్తరింపఁ జేసినాఁడను.

దే వ వ ర్గ స ం పూ ర్ణ ము.

---

## మా న వ వ ర్గ.

క. శ్రీనగజామానసలస
మానసరోహంస నిరుపమానవిభవధా
మా నవముగ నీపేరిట
మానవవర్గువు రచింతు కే మానక సాంబా. 1

టీ. శ్రీపార్వతీదేవిమనస్సు అనెడు ప్రకాశించుచున్న కొలనికి హంసయైనవాఁడా ! (పార్వతీహృదయమందు విహరించువాఁ డని యర్థము.) పోలికలేని వైభవములకు స్థానమైనవాఁడా ! సాంబమూర్తీ ! క్రొత్తగ మానవవర్గును నీ కంకితముగా రచించెదను.

సీ. తొలిచదువులు ప్రాఁతకేపలుకులు మినుకులు
ప్రామినుకులు తొంటికేబాస లనఁగ
వేదాఖ్య లగు నేలకేవేల్పులు తొలిజాతి
వారు మిన్కులచదుకేవరులు జన్ని

గట్టులు దుగపుట్టుకలు పార్లు బాఁపలు
నాఁగ బ్రాహ్మణులకు నామము లగు
ఱేలు దొరలు నేలయేలుదంటలు వెన్ను
వలబుజమునఁ గలవారు రాచ
తే. వారు ఱేఁడులు రెండవవంగడంపుఁ
బబువు లన క్షత్రియాఖ్య లౌ బచ్చు బేరి
మూఁడవకొలంబతేఁడు నాడెకాఁడు నల్ల
నయ్యతోడబిడ్డ కోమటి నాఁ దనర్చు
వైశ్యనామంబు లద్రినివాస సాంబ. 2

టీ. తొలిచదువులు, ప్రాఁతపలుకులు, మినుకులు ॥రూ॥ మిన్కులు, ప్రామినుకులు, తొంటిబాసలు ఈపేళ్లకు పూర్వవాక్యము లని యర్థము-౬= వేదములు. నేలవేల్పులు=భూదేవులు, తొలిజాతివారు=అగ్రవర్ణజులు, మిన్కులచదువరులు=వేదములు చదివినవారు, జన్నిగట్టులు=యజ్ఞోపవీతమును ధరించిన వారు, దుగపుట్టుకలు = రెండుజన్మములు గలవారు-ద్విజులు, పార్లు (పాఱులు)=పాఱువారు, బాఁపలు-౭=బ్రాహ్మణులు. ఱేలు, దొరలు, నేల...దంటలు = భూమిని పాలించు నేర్పరులు, వెన్ను...వారు=విష్ణువు కుడిభుజము నుండి పుట్టినవారు, రాచవారు, ఱేఁడులు, రెండవవంగడంపుఁబబువులు = రెండవవంశమునఁ [అనఁగా క్షత్త్రివంశమునఁ] బుట్టినప్రభువులు-౭ = క్షత్రియులు. బచ్చు, బేరి, మూఁడవకొలంబతేఁడు = మూఁడవకులమునఁ [వైశ్యకులమున] బుట్టినవాఁడు, నాఁడెకాఁడు = నాణెముగలవాఁడు, నల్లనయ్యతోడబిడ్డ=విష్ణువుతొడయందుఁ బుట్టినవాఁడు, కోమటి-౬=వైశ్యుఁడు.

సీ. కలపతాల్పులు తుదికొలము నేర్పరులు కాఁ
పులు వినువాఁకతోఁబుట్టువు లన
నలరును శూద్రాఖ్య లమ్మ కన్నది తల్లి
యవ్వ నా మాతపేళ్లమరుఁ దండ్రి

యబ్బ కన్నయ్య నాయన యయ్య యప్పన
జనకాఖ్య లగుఁ దమ్ముఁడనుఁగు తోడు
తోడఁబుట్టువనంగఁ దోఁబుట్టువన సోద
రాఖ్యలౌ మొదటివాఁడన్న పెద్ద
తే. యనఁగ నగ్రజుఁ డగు నక్క యప్ప యనఁగ
జ్యేష్ఠకన్యకుఁ జెల్లెలు చెల్లె చెలియ
లనఁగఁ దనరుఁ గనిష్ఠ కిల్లాలు రాణి
యాలు పెండ్లా మనఁగ భార్య కగును సాంబ. 3

టీ. కలపతాల్పులు = నాఁగేటిని ధరించినవారు, తుదిక్రాలము నేర్పరులు = కడపటి దగు శూద్రకులమునఁ బుట్టినవిట్టులు, కాఁపులు, విను... బుట్టువులు = గంగకుఁ దోడఁబుట్టినవారు (ఉభయులు విష్ణుపాదమునఁ బుట్టినవా రగుటచే నిట్లు చెప్పఁబడెను) - ౮ = శూద్రులు. అమ్మ, కన్నది, తల్లి, అవ్వ-౪=తల్లి. తండ్రి, అబ్బ, కన్నయ్య, నాయన, అయ్య, అప్ప-౬=తండ్రి. తమ్ముఁడు,అనుఁగు, తోడఁబుట్టువు, తోఁబుట్టువు- ౪ = సోదరుఁడు. మొదటివాఁడు, అన్న, పెద్ద - 3 = అగ్రజుఁడు. అప్ప, అక్క - ౨ = జ్యేష్ఠురాలు. చెల్లెలు, చెల్లె, చెలియలు-3=కనిష్ఠురాలు. ఇల్లాలు, రాణి, ఆలు, పెండ్లాము (రూ. పెండ్లము). ౪=భార్య.

సీ. అయిదువరాలు ముత్తైదు వనఁ బురంధ్రి
కగుఁ దోడికోడ లేరా లనంగఁ
బతిసోదరునిభార్య పరఁగుఁ గూఁతురు కూఁతు
కొమరిత యనఁ బుత్రి కమరుచుండుఁ
గొమరుండు బుడుకఁడు కొడుకు పట్టి యనంగఁ
బుత్రుఁ డౌ బిడ బిడ్డ పూప పాప
కుఱ్ఱ చిఱుత కందు కూన నిసువు పాల

బుడుత నా శిశునామ ౹ ములు దనర్చు

తే. గోల ముద్దియ ముద్దరాల్ ౹ బేల ముగుద
యనఁగ ముగ్ధాంగనకు నాఖ్య ౹ లగును ముదిమి
వాఁడు ముదుకఁడు ముదిసిన ౹ వాఁడు ముసలి
ముదుసలి యనంగ వృద్ధపే ౹ ళ్లొదవు సాంబ. 4

టీ. అయిదువరాలు - ॥రూ॥ ఐదువరాలు, ముత్తైదువ - ౨ = సుమంగలి. తోడికోడలు, ఏరాలు - ౨ = మగనిసహోదరునిభార్య. కూఁతురు, కూఁతు, కొమరిత ॥రూ॥ కొమారిత-కొమార్తె-కొమారి - ౬ = కుమారి. కొమరుఁడు ॥రూ॥ కొమారుఁడు, బుడుకఁడు, కొడుకు, పట్టి-౫ = కుమారుఁడు. బిడ, బిడ్డ, పూప, పాప, కుఱ్ఱ, చిఱుత, కందు, కూన, నిసువు ॥రూ॥ నిసుఁగు, ॥పా॥ సిసువు, పాలబుడుత - ౧౨ = శిశువు. గోల, ముద్దియ, ముద్దరాలు, బేల, ముగుద=(ప్ర.) ముగ్ధ - ౫ = ముగ్ధ(స్త్రీ). ముదిమివాఁడు ॥రూ॥ ముది, ముదుకఁడు, ముదిసినవాఁడు, ముసలి, ముదుసలి-౫=వృద్ధుఁడు.

సీ. పిన్న కొండికవాఁడు ౹ చిన్న పడుచు చోఁటి
పసివాఁ డనెడిపేళ్లు ౹ బాలున కగుఁ
జతురుపేళ్లగు దిట్ట ౹ జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నేర్పరి యనంగఁ
జెలికాఁడు సంగాతి ౹ చెలిమరి గాడిలి
సకియ సంగడికాఁడు ౹ సంగడీఁడు
చెలి నేస్తి యనఁ జను ౹ స్నేహితునకుఁ జెల్మి
నంటు మాలిమి పొం దనంగ మైత్రి

తే. కొఱలుఁ గుఱుచ టెంగణ గిడ్డ ౹ గిఱిక గుజ్జు
పొట్టి యన వామనాఖ్యలౌ ౹ గట్టివాయి
ఱాఁగ జంత గయాళియు ౹ నాఁగఁ దనరు

ధూర్తవనితకు దురితవిదూరసాంబ. 5

టీ. పిన్న, కొండికవాఁడు, చిన్న, పడుచు, చోఁటి ॥రూ॥ చోఁటి, పసివాఁడు - ౬ = బాలుఁడు. బిట్ట, జాణ, దంట, వలంతి, వెరపరి, ప్రోడ, నేర్పరి - ౭ = చతురుఁడు. చెలికాఁడు, సంగాతి, చెలిమరి, గాదిలి, సకియ, సంగడికాఁడు, సంగడీఁడు, చెలి, నేస్తి - ౯ = స్నేహితుఁడు. చెల్మి, ॥రూ॥ చెలిమి, నంటు, మాలిమి, పొందు - ౪ = మైత్రి. కుఱుచ, టింగణ ॥రూ॥ టింగణా, గిడ్డ, గిఱిక, గుజ్జు, పొట్టి - ౬ = వామనుఁడు. గట్టివాయి, టాఁగ, జంత, గయాళి [రూ॥ గయ్యాళి] - ౪ = ధూర్తురాలు.

సీ. కబ్బముచేఁతరి కయి కైసరుఁడు మాట
లల్లువాఁ డనుపేళ్లు చెల్లుఁ గవికి
బట్టులు చదువరుల్ బట్లు క్రిక్కు లనంగ
వందుల కగుఁ బడవాళ్లు వేగు
వారు వేగరు లనఁ జారులపే ళ్లొప్పు
బోయీలు బెస్తలు మోపరు లన
వాహకులకుఁ జెలు సాహిణి సాని రా
తనఁగ నశ్వారోహకునకుఁ దనరుఁ
తే. గట్టికలు పణిహారులు కటిక లనఁగ
వేత్రపాణుల కగు బోయ వేఁటకాఁడు
నడవిద్రిమ్మరి యనఁ గిరాతాఖ్య లెసఁగు
నన్నగళ వేఁడి యన పండుఁ డగును సాంబ. 6

టీ. కబ్బముచేఁతరి, కయి, కైసరుఁడు, మాటలల్లువాఁడు-౪ = కవి. బట్టులు, చదువరులు, బట్లు, క్రిక్కులు - ౪ = వందులు. పడవాళ్లు, వేగువారు, వేగరులు - ౩ = చారులు. బోయీలు ॥రూ॥ బోయలు, బెస్తలు, మోపరులు- ౪=వాహకులు. సాహిణి, సాని, రాతు - ౩ = అశ్వారోహకుఁడు, గట్టికలు, పణిహారులు, కటికలు-౩ = బెత్తము చేతఁగలద్వారపాలకులు మొదలైనవాలు

వుడుగాంగ్రడు. బోయ, వేఁటకాఁడు, అడవిద్రిమ్మరి - 3 = బోయవాండు) [కిరాతకులు]. అన్నగళ, పేడి-౨=నపుంసకుఁడు.

సీ. జాలరి వలఱేఁడు ♦ మీలవేఁటరి యనఁ
      దగు ధీవరుని పేళ్లు ♦ తడుపుదాల్పు
   వడు గొంటిజందెము ♦ వాఁడు బమ్మాచారి
      యన బ్రహ్మచారి పే ♦ ళమరు గేస్తు
   మనికిఱేఁ డింటివాఁ ♦ డన గృహస్థున కగు
      నడవికాఁపు తపసి ♦ జడలదారి
   నాఁ జెలువొందు వా ♦ నప్రస్థునకు నొంటి
      కాఁడు గోఁణముదారి ♦ బోడ బీద
తే. కావులుగలాఁడు సన్న్యాసి ♦ నా వెలుంగు
   యతిసమాఖ్యలు ముగితిము ♦ త్తైదు వనఁగ
   జక్కి నన బేరఁటా లన ♦ జరుగు మృతచి
   రంటినామంబు లాపన్న ♦ రక్ష సాంబ. 7

టీ. జాలరి = జాల [వల] లు గలవాఁడు. వలఱేఁడు, మీలవేఁటరి = మత్స్యములను వేఁటాడువాఁడు- 3 =చేఁపలనుబట్టువాఁడు. తడుపుదాలుపు= చిన్నవస్త్రము గట్టుకొనువాఁడు, వడుగు = [ప్ర] వటువు, ఒంటి జందెము వాఁడు=ఒక పేటుజందెము గలవాఁడు, బమ్మాచారి-౪=బ్రహ్మచారి. గేస్తు = [ప్ర] గృహస్థు, మనికిఱేఁడు, ఇంటివాఁడు- 3 = గృహస్థుఁడు. అడవికాఁపు =అడవియందు నివసించువాఁడు, తపసి - [ప్ర] తపస్వి = తపస్సు చేయు వాఁడు, జడలదారి=జడలనుధరించినవాఁడు- 3 = వానప్రస్థుఁడు. ఒంటికాఁడు, గోఁణముదారి=కౌపీనము ధరించినవాఁడు, బోడ,బీద, కావులుగలాఁడు=కాషాయములను ధరించినవాఁడు, సన్నాసి=[ప్ర]సన్న్యాసి- ౬=సన్న్యాసి, ముగితి

ముత్తైదువ=ముక్తి చెందిన సువాసిని, జక్కిని, పేరంటాలు-౩=మృతచిరంటి లోకాంతరము పొంది దేవత్వము వడసిన ముత్తయిదువ].

సీ. మూకాఖ్యు లగు మూవ మూఁగ మూఁగి యనంగ
గ్రుడ్డి చీకన నంధకునకుఁ జెల్లు
బరువము ప్రాయము వయసు జవ్వన మన
యౌవనాభిఖ్య లౌ నందగాఁడు
వగకాఁ డమరువాఁడు వన్నెకాఁ డెమ్మెకాఁ
డౌసుకాఁ డన సొగసైనవాఁడు
నీటుకాఁ డనఁగ రాణించు శృంగారికి
గోవాళ్లు బొజుఁగు నాఁ గోడెకాఁడు
తే. వెచ్చకాఁడు ననుపుకాఁడు వేడ్కకాఁడు
లంజెకాఁడు మిండఁ డనఁ బోల్లవుఁడు దనరు
సోయగంబు చక్కఁదనంబు సొబగు రూపు
నాఁగ సౌందర్యమునకుఁ జెన్నగును సాంబ. 8

టీ. మూవ, మూఁగ, మూఁగి-౩ = మూకుఁడు. గ్రుడ్డి, చీకు - ౨ = అంధకుఁడు. పరువము, ప్రాయము॥రూ॥పాయము, వయసు [ఇది సంస్కృతసమము], జవ్వనము=[ప్ర.] యౌవనము-౫ = యౌవనము. అందగాఁడు, వగకాఁడు, అమరువాఁడు, వన్నెకాఁడు, ఎమ్మెకాఁడు, ఔసుకాఁడు=హౌసు గలవాఁడు, సొగసైనవాఁడు, నీటుకాఁడు-౮=శృంగారవంతుఁడు. గోవాళ్లు=యౌవనము గలవాఁడు, బొజుఁగు, కోడెకాఁడు, వెచ్చకాఁడు=వెచ్చము నిచ్చువాఁడు, న [illegible]ురాగము గలవాఁడు, వేడ్కకాఁడు, లంజెకాఁడు=లంజెగలవాఁడు, మిండఁడు - ౮ = విటుఁడు. సోయగము చక్కఁదనము, సొబగు, రూపు - ౪ = సౌందర్యము.

సీ. గట్టిమనసువాఁడు గడుసరి యొక్కరి
దిటవరి దిట్టన ధీరున కగుఁ

కుచ్చితుఁ డడిగొట్టు * కూళ పెంకె బికారి
  ముడికాఁడు చిలుమువాల్ * మోటు లుచ్చ
చెండిపోతు గరాసు * మొండికట్టె తులువ
  కైలాటకాఁడు టక్కరి పిసాళి
టకటొంకు టాటోటు * తవళి దబ్బిలి దూబ
  గడుసు కల్లరి దోసకారి చెనఁటి
తే. పాలసుఁడు లండి పిక్కరి * పలువ చెడుగు
  బేరజ మనంగ ధూర్తుని పేరు లమరుఁ
  బగఱు మార్తురు పగతురు * పవతు రనఁగ
  సహితులకు నామధేయము * లమరు సాంబ. 9

టీ. గట్టిమనసువాఁడు, గడుసరి, ఉక్కరి=శౌర్యము గలవాఁడు, దిట వరి=వెనుదీయనివాఁడు, దిట్ట-౫=ధీరుఁడు. కుచ్చితుఁడు=[ప్ర.] కుత్సితుఁడు, అడిగొట్టు, కూళ, పెంకె, బికారి, ముడికాఁడు, చిలుమువాఁడు, మోటు, లుచ్చ, చెండిపోతు, గరాసు, మొండికట్టె, తులువ, కైలాటకాఁడు = జగడ మాడువాఁడు, టక్కరి, పిసాళి, టకటొంకు, టాటోటు॥రూ॥తాటోటు, తవళి ॥రూ॥ తవళి, దబ్బిలి, దూబ, గడుసు, కల్లరి = అబద్ధము లాడువాఁడు, దోస కారి=దుష్కార్యములు సేయువాఁడు, చెనఁటి, పాలసుఁడు, లండి, పిక్కరి= వంచనగలవాఁడు, పలువ, చెడుగు, బేరజము-33 = ధూర్తుఁడు. పగఱు, మార్తురు, పగతురు, పవతురు - ౪ =శత్రువులు.

సీ. పెఱవారు కడవారు * వింతవా రెడవారు
  లాఁతివా రన నన్యులకుఁ జెలంగుఁ
జుట్టలు చుట్టాలు * చుట్టముల్ విందులు
  బందుగు లనఁ జెల్లు * బంధువులకుఁ

కూర్చువాఁ డెడకాఁడు ¦ కుంటెనకాఁ డనఁ
దాపికాఁ డనఁ బేరు ¦ దనరుచుండు
విటుదూత బయకాఁడు ¦ వీణెకాఁ డనఁ బొల్చు
వైణికునకు గాణ ¦ పాటకుఁ డన
తే. గాయకుని కగుఁ దిక్క వెం¦గలి వెడంగు
వెకలి వీఱిఁడి వెంబర¦విత్తు వెట్టి
వేఁదు అనఁగ నపస్మారి ¦ వెలయుఁ జెవిటి
వినని వాఁ డన బధిరాఖ్య ¦ లొనరు సాంబ

టీ. పెఱవారు, కడవారు, వింతవారు, ఎడవారు, లాఁతివారు-౫=అన్యులు. చుట్టలు, చుట్టాలు, చుట్టములు, విందులు, బందుగులు [ప్ర.] బంధువులు - ౫=బంధువులు. కూర్చువాఁడు, ఎడకాఁడు, కుంటెనకాఁడు, తాపికాఁడు - ౪=విటునిదూత. విటీవిటులను తార్చువాఁడు. బయకాఁడు, వీణెకాఁడు - ౨=వైణికుఁడు. గాణ, పాటకుఁడు - ౨=గాయకుఁడు. తిక్క, వెంగలి, వెడఁగు, వెకలి, వీఱిఁడి, వెంబరవిత్తు, వెట్టి, వేఁదులు- ౮=అపస్మారి. చెవిటి, వినని వాఁడు - ౨ = బధిరుఁడు.

సీ. ఎకిమీఁడు పాదుసా ¦ యేలిక మన్నీఁడు
సాహేబు రాయఁడు ¦ సామి పబువు
జియ్యు తుపాసి వ¦జీరుండు రాయలు
దునెదారి రాఱేఁడు ¦ దొర యొడయఁడు
నేఁ డన వర్తిల్లు ¦ నృపుపేళ్లు పడవాలు
దళవాయి దళ్వాయి ¦ దణి యనంగఁ
దగు దళకర్తకుఁ ¦ దగువాఁడు చెరవరి
తీర్పరి కార్భారి ¦ దిట్ట యనఁగఁ,
తే. గార్యకర్తకుఁ జెలఁగు ప్రెగ్గడ నిజో¦గి

ప్రెగడ మంతిరి నా మంత్రి పేళ్లు వెలయుఁ
బంగునకు లేవఁజాలని వాఁడు పుట్టు
మొండి పిచ్చుకుంటను పేళ్లు పొసఁగు సాంబ. 11

టీ. ఎకిమీఁడు, పాదుసా (ఇది తురకపదము) ॥రూ॥ పాదుసాహి, ఏలిక, మన్నీఁడు ॥పా॥ మన్నియ ॥రూ॥ మన్నియఁడు - మన్నెఁడు, మన్నె, సాహేబు (ఇది తురకపదము), రాయఁడు, సామి (ప్ర. స్వామి), పబువు (ప్ర. ప్రభువు), జియ్య, తుపాసి, వజీరుఁడు, (ఇది తురకపదము) ॥రూ॥ వజీరు, వ్రజీఁడు, రాయలు, దునెదారి ॥రూ॥ దునేదారి, రా, ఱేఁడు, దొర, ఒడయఁడు, నేఁడు - ౨౬ = రాజు. పడవాలు, దళవాయి, దళ్వాయి, దణ్ణర = సేనాధిపతి. తగువాఁడు, వెరవరి (వెరవు+అరి) = ఉపాయమెఱిఁగినవాఁడు, తీర్పరి, కార్భారి, దిట్ట-౫=కార్యసమర్థుఁడు. ప్రెగ్గడ, నిజోగి (ప్ర. నియోగి), ప్రెగడ ॥రూ॥ పెగడ, మంతిరి - ౫ = మంత్రి. లేవఁజాలనివాఁడు, పుట్టుమొండి, పిచ్చుకుంటు ॥రూ॥ పిచ్చుకకుంటు - పిచ్చికుంటు - పిచ్చికకుంటు-౬=కాళ్లు లేనివాఁడు.

సీ. ఎడకాఁడు కొల్లగాఁ డెడద్రోవకాపరి
గడిదొంగ దోఁపుడుకాఁడు నాఁచు
గజముచ్చు చేవాఁడికాఁడు జాజరకాఁడు
ముచ్చరి మునిముచ్చు మాయదారి
తెరువాటుకాఁడు కత్తెరదొంగ దొరకోలు
సన్న్యాసి వడికాఁడు కన్నగాఁడు
క్రెదిమ్మరీఁడు ముల్లియవిప్పు లోవాఁడి
కాఁడు తెక్కలికాఁడు కల్లరీఁడు
తే. తవళి మోసరి యనఁ జెల్లుఁ దస్కరునకుఁ
దొత్తు సాఁకుడు బోనముకత్తె దాది

విలువరమ్ముఁడు వరవ్రుఁ డిల్ § బిడ్డ యనఁగ
దాసికానామధేయముల్ § దనరు సాంబ. 12

టీ. ఎడకాఁడు, కొల్లగాఁడు, ఎడత్రోవకాపరి = నడిదారిని కాచికొని యుండువాఁడు, గడిదొంగ=ఒళవెఱిఁగినదొంగ, దోఁపుడుకాఁడు ॥రూ॥ దోఁపిడికాఁడు-దోఁపుకాఁడు, నాఁచు, గజముచ్చు=పెద్దదొంగ, చేవాఁడికాఁడు=చేతులచే క్రూరత్వమును జూపువాఁడు, జాజరకాఁడు ॥రూ॥ జజ్జరకాఁడు=మోసము గలవాఁడు, మచ్చరి (ప్ర. మత్సరి), మునిముచ్చు=మునివేషముతో నమ్మించి దొంగిలించువాఁడు, మాయదారి=మాయలుగలవాఁడు, తెరువాటుకాఁడు=బందికట్టికొట్టువాఁడు, కత్తెరదొంగ=కత్తిరించువాఁడు, దొరకోలుసన్నాసి=నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొని పోవువాఁడు, వడికాఁడు=చులుకఁదనముగలవాఁడు, కన్నగాఁడు=కన్నము పెట్టువాఁడు, రేద్రిమ్మరీఁడు=దొంగిలించుటకు రాత్రులందుఁ దిరుగువాఁడు, ముల్లియవిప్పు=సొమ్ముముడిని విప్పువాఁడు, లోవాఁడికాఁడు = పైకి మెత్తనివాఁడుగాఁ దోఁచి లోపలఁ గ్రూరత్వము గలిగియుండువాఁడు, తెక్కలికాఁడు, కల్లరీఁడు (కల్ల+అరి+ఈఁడు), తవళి ॥రూ॥ తవళి, మోసరి [మోసము+అరి]-ఇ=దొంగ. తొత్తు, సాఁకుడు, బోనముకత్తె, ॥రూ॥ బోనకత్తె, దాది [ప్ర. ధాత్రి], విలువరమ్ముఁడు, వరవ్రుఁడు, ఇలుబిడ్డ-ఇ=దాసి.

సీ. పడుపుఁజాన గడించు § పడఁతి మేల్దాపరి
బోగపుఁజేడియ § పొత్తుటాలు
వేడుకచెలి లంజె § వెలయాలు రోచెల్వ
వెల్లాటకత్తె నా § వేశ్య వెలయుఁ
గూర్చియిచ్చుమిటారి § కుంటెనకత్తియ
తాపికత్తె యనంగఁ § దనరు దూతి
నాగవాసం బన § నామ మా వేశ్యల

మేళంబునకుఁ గొమఽరాలు కొమిరె
తే. చాను జవరాలు కొమరిత ఽ జవ్వని యన
సుందరికిఁ జెల్లు గట్టివైఽసుదియుఁ బ్రోడ
యనఁగఁ దగుఁ బ్రౌఢ వయసుఽచెల్లినది ముసలి
మిండకోరన లోలాఖ్య ఽ మెఱయు సాంబ. 13

టీ. పడుపుఁజాన [పడుపు+చాన]=ఆర్జవముగలస్త్రీ, గడించుపడఁతి= ఆర్జించుస్త్రీ, మేల్దాపరి, బోగపుఁజేడియ [బోగము+చేడియ], పొత్తుటాలు [పొత్తు+ఆలు], వేడుకచెలి=విలాసార్థమైనస్త్రీ, లంజె, వెలయాలు [వెల+ ఆలు]=క్రయమునకు భార్యగా వచ్చెడి స్త్రీ, రోచెల్వ=ద్రవ్యమునకు వచ్చెడు స్త్రీ, వెల్లాటకత్తె = మిక్కిలి నాట్యమాడు స్త్రీ-౧౦=వేశ్య. కూర్చి యిచ్చు మిటారి, కుంటెనకత్తె, తాపికత్తె-౩=దూతిక. నాగవాసము=వేశ్యలసమూహము. కొమరాలు, కొమిరె=లేఁతవయస్సు గలది, చామ, జవరాలు=యౌవనముగలది. కొమరిత ॥రూ॥ కొమారిత-కొమార్త, జవ్వని [జవ్వనము+ఇ]=యౌవనముగలది-౭ = ప్రాయముగల స్త్రీ, గట్టివైసుది, ప్రోడ [ప్ర. ప్రౌఢ]-౨ = ప్రౌఢ స్త్రీ. వయస్సు చెల్లినది, ముసలి, మిండకోరి ॥రూ॥ మిండలకోరి-౪= లోల స్త్రీ.

సీ. కన్నియ కన్నె నా ఽ కన్యక కగుఁ బేరు
లాసగలది అంకుఽలాడి చెడిపె
వెలిచోరవరి యన ఽ వెలయుఁ జారిణిపేళ్లు
మెయి మేయి యొడలు నెఽమ్మేను మేను
బొంది మే మై యనఁ ఽ బొసఁగు దేహమునకు
నెఱకలు వెంద్రుకల్ ఽ నెఱు లనంగఁ
గేశసమాఖ్య లౌఁ ఽ గేశబంధముపేళ్లు
కీల్ముడి క్రొమ్ముడి ఽ కీలుగంటు

తే. నూనెముడి వెన్నుగంటన నొనరు శిఖకు
జుట్టు సిక సిగ యనఁ జెల్లుఁ జుంచు కురులు
ముంగురులు కూఁకటు లనంగఁ బొసఁగు చుండుఁ
గుంతలములకు జితదైత్యకూట సాంబ. 14

టీ. కన్నియ, కన్నె (ప్ర. కన్య)-౨ = కన్య. ఆసగలది, అంకులాఁడి, చెడిపె, వెలిచొరవరి=బయటిచొరవగలది-౮=జారిణి. మెయి, మేఁయి, ఒడలు, నెమ్మేను, మేను, బొంది, మే, మై-౮ = దేహము. నెఱకలు, వెండ్రుకలు, నెఱులు ॥రూ॥ నెరులు-౮=కేశములు. కీల్మొడి, క్రొమ్ముడి (క్రొత్త+ముడి) (ఇది 'కుఱుముడి'కిఁ గలిగిన 'క్రుమ్ముడి' యని కొన్నిప్రయోగములఁ జూపట్టుచున్నది.) కీలుగంటు- నూనెముడి, వెన్నుగంటు-౫ = కేశబంధము-అనఁగా జాఱుగా ముడిఁచిన వెండ్రుకల దూమిడి. జుట్టు, సిగ, సిక-౩=శిఖ. *చుంచు, కురులు, ముంగురులు (మున్ను+కురులు), కూఁకటులు-౮=కుంతలములు-అనఁగా పొడిపెండ్రుకలు.

సీ. కొప్పు వేనలి మూల క్రొవ్వెద తుఱు మనఁ
గబరి యాఁ కఱ్ఱ గను క న్ననంగ
నేత్రాఖ్య లగు నెసల్ నెన్నొసల్ నుదురు నె
న్నుదు రన నిటలాఖ్య లొందవుఁ జూడ్కి
పొరువ దిష్టి చూపన వీక్షణము లొప్పు
వీనులు చెవులును జానుగులును
నా నొప్పు శ్రోత్రముల్ కౌను లేఁగౌను నె
న్నడుము నడు మనంగ నడరు మధ్య
తే. మునకుఁ బొక్కిలి బొడ్డనఁ దనరు నాభి

* చుంచు, కూఁకటులు - ఈరెండు శబ్దములును కుంతలపర్యాయములగుట విచార్యము.

మూతి మోర మొకము మోము ꣾ మొగ మనంగ
వదనము దనర్చు వా నోరు ꣾ వాయి యనఁగ
ముఖనుహాభిఖ్య లగు గురుసోమూర్తిసాంబ. 15

టీ. కొప్పు, వేనలి, మూల, క్రొవ్వెద (క్రొత్త+వెద), తుఱుము-౫= కొప్పు. కఱ, కను, కన్ను-౩ = నేత్రము. నొసలు, నెన్నొసలు, నుదురు, నెన్నుదురు-౪ = నిటలము. చూడ్కి, పారువ (అరవపదము), దిష్టి (ప్ర. దృష్టి), చూపు-౪=దృష్టి. వీనులు చెవులు, జానుగులు-౩=కర్ణములు. కౌను ||రూ|| కవును, లేఁగౌను [లేత+కౌను], నెన్నడుము (నెఱ+నడుము), నడుము-౫=మధ్యము. పొక్కిలి, బొడ్డు-౨ = నాభి. మూతి, మోర, మొకము, మోము, మొగము [ఈ ౩ కి ప్ర. ముఖము]-౫=ముఖము. వా, నోరు, వాయి-౩=నోరు.

సీ. పలు పల్లు పండులు ꣾ పండ్లన రదము లొఁ
 జెంప దవడ చెక్కు ꣾ చెక్కి లనఁగఁ
దగుఁ గపోలము నెత్తి ꣾ తల యన శిర మొప్పు
 ముకు ము క్కనంగ నాసిక చెలంగు
బొమ కనుబొమ యన ꣾ భ్రూనామ మమరు మీ
 సలు మీసము లనంగ ꣾ శ్మశ్రు వలరు
నదరము కెమ్మోవి ꣾ పెదవి వా తెఱ మోవి
 యన నోష్ఠ మగు నెద ꣾ యక్కు ఱొమ్ము
తే. నెడఁద యన వక్షు మగుఁ బొట్ట ꣾ కడుపు బొజ్జ
బొజ్జి డొక్కన నుదరంబు ꣾ పొసఁగుచుండుఁ
గేలు కై కయి చేయి కెంగే లనంగఁ
బంచశాఖకు నామముల్ ꣾ పరఁగు సాంబ. 16

టీ. పలు, పల్లు, పండులు, పండ్లు-౪ = దంతములు. చెంప ||పా||

చెంక, దవడ, చెక్కు, చెక్కిలి - ౫=కపోలము. నెత్తి, తల - ౨ = శిరము, ముకు, ముక్కు - ౨=నాసికము. బొమ, కనుబొమ - ౨ = భ్రూలత. మీసలు, మీసములు - ౨ = శ్మశ్రువులు. ఆదరము (ప్ర. అధరము), కెమ్మోవి (కెంపు + మోవి), పెదవి, వాతెఱ (వాయి + తెర), మోవి-౫=ఓష్ఠము. ఎద, అక్కు, ఱొమ్ము, ఎడఁద - ౪ = వక్షము. పొట్ట, కడుపు, బొజ్జ, బొఱ్ఱి, డొక్కు-౫=ఉదరము. కేలు (నిత్యైకవచనాంతము), కై, కయి, చేయి॥రూ॥ చెయి, చెయ్యి, చే, కెంగేలు (కెంపు + కేలు) - ౮=హస్తము.

సీ. అఱచెయ్యి లోచెయి కరతల మొప్పు
        బెడచెయ్యి మీఁజెయి వెనుకచెయ్యి
    యనఁ దగుఁ జరమశయంబు వేల్ వ్రేలన
        నంగుళి యగుఁ జరమాంగమునకు
    వెన్ను వెనుకమేను వీఁపన వర్తిల్లు
        గద్దువ గడ్డము గాద యనఁగఁ
    జిబుకనామంబు రాజిల్లుఁ గడవసంబు
        చట్టు తోలనఁ గళాసంబు నాఁగఁ
తే. జర్మ మమరు మోఁకాళ్లన జానువు లగుఁ
    బిక్క చిఱుదొడ యన జంఘపేళ్లు దనరుఁ
    గుఱువు తొడ యన నూరువు వఱలు ముడ్డి
    పిఱుఁదు తుంటన జఘనంబుపేళ్లు సాంబ.                    17

టీ. అఱచెయ్యి, లోచెయి- ౨=కరతలము. పెడచెయ్యి, మీఁజెయి (మీఁదు + చెయి), వెనుకచెయ్యి-3 =హస్తచరమభాగము. వేలు, వ్రేలు-౨= అంగుళి. వెన్ను, వెనుకమేను, వీఁపు - 3 = పృష్ఠము. గద్దువ, గడ్డము, గాద ॥రూ॥ గవుద - ౪ =చిబుకము. కడవసము, చట్టు, తోలు, కళాసము, ౪=చర్మము. మోఁకాళ్లు = జానువులు, పిక్క, చిఱుదొడ - ౨ = జంఘ-

కుఱువు, తొడ-౨=ఊరువు. ముడ్డి ॥రూ॥ మూడి, పిఱుఁదు, తుంటి-౮=కటి.

సీ. పునుక పుఱియ పుచ్చె యనఁ గపాలం బొప్పు
    బుజము మూఁ పనఁ జెల్లు భుజము పేళ్లు
  బట్ట వలువ కోక పుట్టంబు గింటెంబు
    చీర నా వసనంబు చెలఁగు నఱుత
  గొంతు కుత్తుక యట్టు కొలిమి మెడ యనంగ
    గళమున కగుఁ బిడికిలి లన ముష్టి
  కగుఁ బ్రసృతికిఁ జేర యన నంజలికి దోయి
    లన హస్తమునకు మూర యనఁగ బొసఁగు
తే. బార యనఁగను వ్యామాఖ్య పరఁగు జేన
  దుత్త యనఁ దాలమున కొప్పు బెత్త యనఁగ
  నంగుళాభిఖ్య యగు నంజ హజ్జ యడుగు
  నాఁగఁ బాదాఖ్య లగు లోకనాథ సాంబ. 18

టీ. పునుక, పుఱియ ॥రూ॥ పుఱ్ఱియ - పుఱ్ఱె, పుచ్చె - ౫ = కపాలము. బుజము, మూఁపు - ౨ = భుజము. బట్ట, వలువ, కోక, పుట్టము, గింటెము, చీర-౬=వస్త్రము. అఱుత, గొంతు, కుత్తుక, అట్టు, కొలిమి, మెడ - ౬=కంఠము. పిడికిలి=ముష్టి. చేర = ప్రసృతి [పుడిసిలి - చాఁచినవ్రేళ్లు గల అఱచేయి]. దోయిలి ॥రూ॥ దోసిలి-౨ = అంజలి. మూర = హస్తము. [మోచేతి మొదలు వ్రేళ్లకొనవఱకుఁ గలభాగము]. బార = వ్యామము [రెండుచేతులు చాఁపఁగా నడుమఁగలసందు]. జేన, దుత్త - ౨ = తాలము [చాఁచినబొటనవ్రేలికొనకు చిటికెనవ్రేలికిని నడుమనుండుసందు]. బెత్త = అంగుళము. అంజ, హజ్జ ॥రూ॥ అజ్జ, అడుగు-3=పాదము.

సీ. చనులు గుబ్బలు చండ్లు చాచులు పాలిండ్లు

చన్ను లనంగఁ గుచంబు లమరు
నారు నూఁగారన ఽ నలరు రోమావళి
పాపలఁ గనుతావు ఽ పత్త బుయ్యి
మరునిల్లు దుబ్బన ఽ మదనమందిర మొప్పఁ
బిల్లలఁ గలిగించువేరు చుల్లి
బుల్ల బెల్ల మనంగ ఽ బొసఁగు శేఫము గాఁడు
గుద్ద పిఱ్ఱి యనంగ ఽ గుదము దనరుఁ
తే. పైఁట పయ్యఁట పయ్యెద ఽ పయఁట చెఱఁగు
నాఁగఁ జేలాంచలాభిధానంబు చెల్లఁగు
గలువడము చందువా మేలుకట్టనంగ
నతిశయిల్లు వితానాహ్వయములు సాంబ. 19

టీ. చనులు, గుబ్బలు, చఁడ్లు, చాచులు, పాలిండ్లు, చన్నులు-౬=స్తనములు. ఆరు. నూఁగారు-౨ = నాభిక్రిందిరోమావళి- పాపలఁ గనుతావు=బిడ్డలను గనునట్టిచోటు, పత్త, బుయ్యి, మరునిల్లు=మన్మథునిగృహము, దుబ్బ -౫=మన్మథగృహము (ఆఁడుగుఱి). పిల్లలఁ గలిగించువేరు = బిడ్డలను బుట్టించుటకు మూలభూతమైనది, చుల్లి ॥రూ॥ చుల్ల, బుల్ల, బెల్లము - ౪ = శిశ్నము. గాఁడు, గుద్ద, పిఱ్ఱి-౩ =గుదము. పైఁట, పయ్యఁటు, పయ్యెద ॥రూ॥ పయ్యెద, పయఁటు, చెఱఁగు - ౬ = వస్త్రాంచలము (చీరకొంగు). కలువడము, చందువా, మేలుకట్టు-౩ =వితానము.

సీ. చెలి ముద్దుగుమ్మ యుగ్మలి నవలా చాన
కన్నె బిత్తరి గోతి ఽ కలికి మగువ
జవరాలు చేడియ ఽ జవ్వని తొయ్యలి
నాతి పైదలి యెలనాఁగ లేమ
సకియ జక్కవచంటి ఽ చామ చిల్కలకొల్కి

గుబ్బెత ప్రోయాలు కొమ్మ పడఁతి
పొలఁతి ముద్దియ ననఁబోఁడి యింతి మిటారి
నెలఁతుక వాల్గంటి నెలఁత తెఱవ
తే. యన్ను లతకూన యొయ్యారి యతివ వెలఁది
చెలియ సకి బోటి కొమరిత చిగురుఁబోఁడి
ముగుద వగలాఁడి సింగారి ముదిత యువిద
గరిత యన భామినీసమాఖ్య లగు సాంబ. 20

టీ. చెలి, ముద్దుగుమ్మ = మనోజ్ఞురాలైనది, ఉగ్మలి, నవలా, చాన, కన్నె ॥రూ॥ కన్నియ, బిత్తరి=శృంగారచేష్ట గలది, గోతి, కలికి = మనోజ్ఞురాలైనది, మగువ, జవరాలు=యౌవనము గలది, చేడియ, జవ్వని=యౌవనము గలది, తొయ్యలి, నాతి, పైదలి, ॥రూ॥ పయిదలి, ఎలనాఁగ, లేమ, సకియ, జక్కవచంటి=జక్కవపక్షులవంటి స్తనములు గలది, చామ, చిలుకలకొలికి = చిలుకలకొలికివంటి కొలుకులు గలది, గుబ్బెత = గుబ్బచన్నులు గలది, ప్రోయాలు, కొమ్మ, పడఁతి, పొలఁతి ॥రూ॥ పొల్తి, ముద్దియ, ననఁబోఁడి = పువ్వువలె మెత్తనిదేహము గలది, ఇంతి, మిటారి = మిటారము గలది, నెలఁతుక, వాల్గంటి=నిడుదలైన కన్నులు గలది, నెలఁత, తెఱవ, అన్ను, లతకూన = లేఁతతీఁగవంటిది, ఒయ్యారి = ఒయ్యారము కలది, అతివ, వెలఁది ॥రూ॥ వెలఁదుక, చెలియ, సకి, బోటి, కొమరిత, చిగురుఁబోఁడి = చిగురువలె మృదువైనశరీరము గలది, ముగుద, వగలాఁడి=చిన్నెలు గలది, సింగారి=శృంగారము గలది, ముదిత, ఉవిద, గరిత-ఇక=స్త్రీ.

సీ. ఆనవాలు(ను) పులు గంగమచ్చము గుఱు
తడియాల మన లాంఛనాఖ్య లొదవు
జడితి గొబ్బున వేగ సరగు గ్రిక్కున వడి
వేగిర మనఁ దగు వేగమునకు

మరియాద గడి మేర సరు దెల్ల కర యనఁ
బరఁగు మర్యాదకు వెఱఁగు వింత
యక్కజ మబ్బుర మరిది నివ్వెఱ యబ్ర
మచ్చెరు వన నద్భుతాఖ్య లమరుఁ
తే. బరుగు కదలిక పరు వన మెఱయు ధావ
నమ్మునకు వేడ మొనరించెఁ గ్రమ్మెఁ బొదివెఁ
జుట్టుకొనె నావరించె నా నిట్టినుడులు
వేష్టనంబున కమరు సర్వేశ సాంబ. 21

టీ. ఆనవాలు, పులుగు, అంగమచ్చము, గుఱుతు, అడియాలము-౫= లాంఛనము. జడితి [ప్ర. ఝడితి], గొబ్బునన్, వేగ, సరగు, గ్రక్కునన్, పడి, వేగిరము-౭ = వేగము. మరియాద, గడి, మేర, సరుదు, ఎల్ల, కర-౬= మర్యాద. [హద్దు] వెఱఁగు, వింత, అక్కజము, అబ్బురము, అరిది, నివ్వెఱ [నిండు + వెఱ], అబ్రము, అచ్చెరువు [ప్ర. ఆశ్చర్యము]-౮ = అద్భుతము. పరుగు, కదలిక, పరువు-౩=ధావనము [పరుగెత్తుట]. వేడమొనరించె, క్రమ్మె, పొదివె, చుట్టుకొనె, ఆవరించె-౫=పరివేష్టించెను.

సీ. బువ్వ మెతుకు కూడు బోన మోరెము పసా
దము వంటకము పసాదనము బాతు
సాద మోగిర మన జరుగు నన్నము పేళ్లు
కుడిచె బోసేసె సాపడియె నమలె
నారోగిణ మొనర్చె నారగించె మెసవెఁ
దినె మెక్కె నన భుక్తిగొనుట కలరుఁ
బనులు చెయ్వులు సేఁత లనఁ గర్మముల కొప్పుఁ
గనలు మోడి యలుక కినుక కిన్క
తే. నాఁగఁ గోపాఖ్య లగు లజ్జ నాన సిగ్గు

బొసుకు పుయిలోట సిబ్బితి ఽ పుచ్చటి కనఁ
బరఁగు వ్రీడాఖ్య యోల నె౯పంబు సా క
నంగ వ్యాజం బమరు జగ౯న్నాథ సాంబ. 22

టీ. బువ్వ, మెతుకు, కూడు, బోనము, ఓరెము, పసాదము. [ప్ర. ప్రసాదము], ఐంటకము, పసదనము, బాతు [అన్యదేశ్యము], సాదము [ఇది అపపదము], ఓగిరము-౧౧=అన్నము. కుడిచె, బోనేసె, సాపడియె, నమలె, ఆరోగిణ మొనర్చె, ఆరగించె, మెసవె ॥రూ॥ మెసఁగె, తినె, మెక్కె, ౧౦=భుజించెను. పనులు, చెయ్వులు, చేఁతలు-౩=కృత్యములు. కనలు, మోడి, అలుక ॥రూ॥ అల్క, కినుక, కిన్క-౬ = కోపము. లజ్జ, నాన, సిగ్గు, బొసుకు - పుయిలోటు, సిబ్బితి, పుచ్చటిక ॥రూ॥ పుచ్చడీక-౮ = లజ్జ. ఓల, నెపము ॥రూ॥ నెవము [ప్ర. నిభము], సాకు-౩ = వ్యాజము.

సీ. పానుపు తలిమంబు ఽ పఱుపు లే పన మెత్త
సెజ్జ యనఁగ శయ్య ఽ చెలఁగు చుండుఁ
బన్నుండెఁ దెన్నుండెఁ ఽ బండుకొనెఁ బరుండెఁ
బవ్వళించెను బండెఁ ఽ బడక సేసె
నత్తమిల్లె ననంగ ఽ నలరారు శయనించెఁ
ననుటకు నిద్దుర౯గొనియె గుఱక
గొనియె నిద్దురవోయెఁ ఽ గూర్కెడె నన నిద్రి
తున కొప్పు లేచె మేల్కొనియె మెలఁకు
తే. వయ్యె నన జాగ్రదభిధాన ఽ మమరు వేడ్క
యెలమి వేడుక సంతోస ఽ మింపు ముదము
సంతసము సొంపు మే లకు౯సం బనంగఁ
బ్రమదమున కాఖ్య లగు జగ౯త్పాలసాంబ. 23

టీ. పానుపు ॥రూ॥ పాన్పు, తలిమము, పఱుపు, శేపు, మెత్త,

సెజ్జ [ప్ర. శయ్యా]-౭ = శయ్య. పన్నుండె, తెన్నుండె ॥పా॥ తొన్నుండె, పండుకొనె, పరుండె, పవ్వళించెను, పండె, పడకసేసె, అత్తమిల్లెన్ = శయనించెను. నిద్దురగొనియె ॥రూ॥ నిదురగొనియె, గుఱకగొనియె, నిద్దుర వోయె, కూర్కెడె - ౫ = నిద్రించెను. లేచె, మేల్కాంచె ॥పా॥ మేల్కనె, మేలుకువయ్యె - ౮ జాగరూకుడయ్యెను = [ప్రబోధ మందెను]. వేడ్క, ఎలమి, వేడుక, సంతోసము, ఇంపు, ముదము, సంతసము, సొంపు, మేలు, అరుసము-౧౦ = సంతోషము.

సీ. పలికె వాక్రుచ్చె నొప్పనసేసె మందలిం
చెను విన్నవించెఁ జెప్పె ననె నొడివె
నాడెఁ బల్కె వచించె నన భాషణముసేసె
ననుట కౌ వీనిచ్చె నాలకించె
వినెఁ జెవియొగ్గెను వినియె నాలించె నా
శ్రుతమయ్యె ననుట కౌఁ జులుక చౌక
యులక యెల్లిద మన నొనరు లఘుతపేళ్లు
పులకలొత్తెను గగుర్పొడిచె గగురు

తే. పాటె గరుపాటె మైమోజుపర్వె ననఁగ
దగును రోమాంచనామముల్ నగవు నవ్వు
నగు న వన హాసమున కొప్పు నడిమిదిన్నె
దీవి యన ద్వీప మగుఁ బరదేవ సాంబ. 24

టీ. పలికె, వాక్రుచ్చె, అప్పనసేసె [ప్ర. అర్పణచేసెను], మందలించె, విన్నవించె, చెప్పె, అనెను, నొడివె, ఆడె, పల్కె, వచించె-౧౧ = సంభాషించెను. వీనిచ్చె, ఆలకించె, వినె, చెవియొగ్గె, వినియె, ఆలించెఁ-౬ = వినెను. చులుక ॥రూ॥ చుల్క, చౌక ॥రూ॥ చవుక, ఉలక, ఎల్లిదము-౬ = లఘుత్వము. పులకలొత్తెను, గగుర్పొడిచె॥ రూ॥ గగురుపొడిచె, గగ్గురుపొడిచె,

గగుర్పాటు, గరుపాటు, మైమోజుపర్వె - ౭ = రోమాంచమయ్యె. నగవు, నవ్వు, నగు, నవు-౮ = హాసము. నడిమిదిన్నె, దీవి-౨౨=ద్వీపము.

సీ. జోత చాఁగిలి కొల్పు ♦ జోహారు గిడిగిడి
 మోడుపు చేకూర్పు ♦ మ్రొక్కు మొగుపు
చిన్నిపూ చేమోడ్పు ♦ జేజె వెన్నెల చెంగ
 నాలు గొబ్బులు టెంకణాలు నేరె
డల్లుల్ సలా మన ♦ నమరు దండముపేళ్లు
 పళ్లెము కంచము ♦ పళ్లెరంబు
తెలె హరివాణంబు ♦ తలియ తట్టి యనంగ
 భాజనం బగు గిన్నె ♦ బటుది కోర
తే. డబ్బుర యనంగఁ జమక మౌ ♦ డప్పి దూప
 దప్పి దగ నీరువట్టన ♦ దాహ మమరుఁ
 జాగ మీవి పుడుకు పెట్టు ♦ తేగ మీగి
 యనఁగఁ ద్యాగసమాభిఖ్య ♦ లగును సాంబ. 25

టీ. జోత ॥రూ॥ జోతము, చాఁగిలి, కొల్పు, జోహారు ॥రూ॥ జోహారువు - జొహారు - జొహారువు, గిడిగిడి, మోడుపు ॥రూ॥ మోడ్పు, చేకూర్పు, మ్రొక్కు, మొగుపు, చిన్నిపూ, చేమోడ్పు, జేజె, వెన్నెల, చెంగనాలు, గొబ్బులు, టెంకణాలు, నేరెడల్లులు, సలాము [ఇది అన్యదేశము] ౨౩ = నమస్కారము. పళ్లెము॥ రూ॥ పళ్యము, కంచము, పళ్లెరము, తెలె॥ రూ॥ తెలియ, హరివాణము, తలియ, తట్టి-౯ = పాత్రము. గిన్నె, బటుది, కోర, డబ్బుర॥ రూ॥ దబ్బుర-౨౪ = చమకము, డప్పి, దూప, దప్పి, నీరువట్టు-౮ = దాహము. చాగము, ఈవి, పుడుకు, పెట్టు, తేగము, ఈగి-౬ = త్యాగము.

సీ. అగపడెఁ జేపడె ♦ నబ్బె దొరకెఁ జిక్కెఁ

దగిలెఁ దగుల్కొనెఁ | దగులువడియెఁ
బట్టువడియెఁ జిక్కెఁ జేపడెఁ దవిలె ననంగ
నమరు గృహీతాఖ్య | లఱచె నేడ్చె
వాపోయె మొఱలిడె | వాచఱచె ననంగ
రోదనంబున కగు | రొద గలిబిలి
చప్పుడు గొలగొల | సద్దు కూఁత యులివు
నలుకుడు రవళి అం | తనఁగ ధ్వనికి
తే. నలరుఁ గలసె బెరసెఁ గూడె | హత్తె దొరసె
నందెఁ బొందెఁ బెనఁగెఁ జెందె | నంటె ననఁగ
నమరు సక్తాఖ్య లోనయ్యె | నగ్గమయ్యె
లోపడె ననంగ స్వవశాఖ్యలు చను సాంబ. 26

టీ. అగపడెను (అగ్గము+పడెను), చేపడె, అబ్బె, దొరకె, చిక్కె, తగిలె, తగులుకొనె, తగులువడె, పట్టువడె, తవిలె-౧౦ = గృహీతుఁడయ్యె. అఱచె, ఏడ్చె, వాపోయె, మొఱలిడె, వాచఱచె-౫=రోదనముచేసె. రొద, గలిబిలి, చప్పుడు, గొలగొల, సద్దు, కూఁత, ఉలివు, నలుకుడు, రవళి ॥రూ॥ రవాళి, అంతు - ౧౧=ధ్వని. కలసె, బెరసె, కూడె, హత్తె, అందె, పొందె, పెనఁగె, చెందె, అంటె-౧౦=సక్తమయ్యె. లోనయ్యెను, అగ్గమయ్యెను, లోపడెను-౩=స్వవశమయ్యెను.

సీ. ఎడసె వీడెను బాసె | నెడఁబాసెఁ బురివిచ్చె
వేఱువడె ననంగ | వెలయుచుండుఁ
బ్రత్యేకమయ్యె నర్థపలుకులు వెడలించె
వెళ్లఁగొట్టెను దోలె | వెలలఁబన్నెఁ
దఱిమె రొప్పె ననంగఁ | దనరు నుచ్చాటనం
బొనరించె ననుటకుఁ | గనియెఁ జూచెఁ

గనుఁగొనెఁ దిలకించెఁ ఽ గనెఁ గాంచె ననఁ జెల్లు
దర్శించె ననుటకుఁ ఽ దాల్చెఁ బూనె
తే. నానె మోచె ననఁగఁ జెల్లు ఽ నధివహించె
ననుట కరికట్టెఁ బోనీక ఽ యంకెచేసె
నాఁగె నిల్పెఁ దటాయించె ఽ నడ్డగించె
నానుకొనె ననఁ దగు వారఽణాఖ్య సాంబ. 27

టీ. ఎడసె, వీడెను, పాసె, ఎడఁబాసె, పురివిచ్చె, వేఱుపడె - ౬ = ప్రత్యేకమయ్యెను. వెడలించె, వెళ్లఁగొట్టె, తోలె, వెలలఁబన్నె, తఱిమె, రొప్పె-౬=ఉచ్చాటనముచేసెను. కనియెను, చూచెను, కనుఁగొనెను, తిలకించెను, కనెను, కాంచెను-౬=దర్శించెను. తాల్చె, పూనె, ఆనెను, మోచె-౪=వహించెను. అరికట్టె, పోనీక యంకచేసె, ఆఁగె, నిలిపె, తటాయించె, అడ్డగించె, ఆనుకొనె-౭=వారించెను.

సీ. అంటుగైకొనియె ముఽట్టయ్యెఁ జెఱఁగుమాసెఁ
గడకేఁగె నింటికిఁ ఽ గాకపోయె
ననఁగ దూరస్థకుఁ ఽ దనరుఁ దానముచేసె
నీళ్లుపోసికొనె ముఽనింగెఁ గ్రుంకె
నన నిమజ్జనమయ్యె ఽ ననుటకుఁ దగు మడి
మడుఁగు మడు వనంగ ఽ సడరు శుచికి
మైల కట్టువిడుపు ఽ మా పన మలినాఖ్య
లగుఁ దల్పు వాకిలి ఽ యనఁ గవాట
తే. మున కొనరు నేకతంబు మంఽతన మనంగ
నంతరంగమునకుఁ జెల్లు ఽ నక్కఱ పని
యొంజలియు జోలి యనఁ గార్య ఽ మొనరు గంజి
వార్పన యవాగునామముల్ ఽ వఱలు సాంబ. 28

టీ. అంటుగైకొనియె, ముట్టయ్యె, చెఱఁగుమాసె, కడకేఁగె, ఇంటికిఁ గాకపోయె - ౫ = రజస్వలయయ్యె. తానముచేసె, నీళ్లుపోసికొనె, మునిఁగె, క్రుంకె-౪=స్నానమయ్యె ననుట. మడి, మడుఁగు, మడువు-౩=పరిశుద్ధి. మైల ॥రూ॥ మయిల, కట్టువిడుపు, మాపు-౩=మాలిన్యము. తల్పు ॥రూ॥ తలుపు, వాకిలి-౩ = కవాటము. ఏకతము, మంతనము-౨=అంతరంగము. అక్కఱ, పని, ఒంజలి, జోలి-౪=కార్యము. గంజి, వార్పు-౨=యవాగువు.

సీ. ఒకటి యొక్కఁ డొకండు నొం డన నేకాఖ్య
జమి డిమ్మ డిబ్బడి జంట రెండు
దుగ రెట్టి దువ యన ద్విగుణాఖ్య కవ జోడు
దంట దోయి యనంగ ద్వంద్వసంఖ్య
మూ రెండొకటి తిగ మూఁ డనఁ ద్రయసంజ్ఞ
చా యుడ్డ తీవంచ చౌకము నలు
నాలు గనఁగఁ జతుర్నామముల్ చౌవంచ
యరపది యేను నై దనఁగఁ బంచ
తే. కంబు నా ఱిత్తిగ యన షట్కంబు చక్క
పగడ సత యే డనంగ సప్తకము దచ్చి
యెనిమి దన నష్టకము తొమ్మి దనఁగ నవము
పదియు నీరై దన దశాఖ్య పరఁగు సాంబ. 29

టీ. ఒకటి, ఒక్కఁడు, ఒకఁడు, ఒండు-౪=ఏకము. జమిడి ॥రూ॥ జమిలి, ఇమ్మడి=॥రూ॥ ఇనుమడి - ఇన్మడి, ఇబ్బడి, జంట, రెండు, దుగ, రెట్టి, దువ-౧౧=ద్విగుణము (రెండు). కవ, జోడు, దంట, దోయి-౪ = ద్వంద్వము. మూ, రెండొకటి, తిగ, మూఁడు-౪=త్రిసంఖ్య. చా, ఉడ్డ, తీవంచ (3+౧), చౌకము, నలు, నాలుగు-౬=చతుస్సంఖ్య. చౌవంచ (౪+౧), అరపది, ఏను, ఐదు ॥రూ॥ అయిదు-౫=పంచసంఖ్య. ఆఱు, ఇత్తిగ (ఇరు+తిగ - ౨×3)-

౨=షట్సంఖ్య. చక్కపగడ (౬+౧), సత (ప్ర॰ సప్త), ఏడు=సప్తసంఖ్య. దచ్చి, ఎనిమిది - ౨ = అష్టసంఖ్య. తొమ్మిది = నవసంఖ్య. పది, ఈరైదు (౨×౫)-౨=దశసంఖ్య.

సీ. పదునొకం డనఁగను ✽ బరఁగు నేకాదశం
బీరాఱు పండ్రెండు ✽ బార యనఁగ
రవిసంఖ్య యగు నానెఁ ✽ ద్రాగెఁ ద్రావెను గ్రోలె
ననఁగ బానముచేసె ✽ ననుట కొనరుఁ
బనివినియెను బోయెఁ ✽ జనె నేఁగె నరిగె నాఁ
గృతగమనునకుఁ బే ✽ ర్లెసఁగుఁ గ్రమ్మ
ఱించెఁ ద్రిప్పెను మగి✽డించె మరల్చె నా
నావర్తన మొనర్చె ✽ ననుట కొనరుఁ
తే. బాఱె వెళ్లెను బరువెత్తెఁ ✽ బఱచెఁ గదలె
నుఱికెఁ దొలఁగె నటమరించె ✽ జరిగె ననఁ బ
లాయితుం డయ్యె ననుటకు ✽ నలరుచుండు
సకలసురచక్రవర్తి శ్రీ✽సాంబమూర్తి.

టీ. పదునొకండు=ఏకాదశసంఖ్య. ఈరాఱు (౨×౬), పండ్రెండు, బార - ౩ = ద్వాదశసంఖ్య. ఆనెను, త్రాగెను, త్రావెను, క్రోలెను - ౪ = పానముచేసెను. పనివినియెను, పోయెను, చనెను, ఏఁగెను, అరిగెను-౫= కృతగమనుఁడయ్యెను. క్రమ్మఱించెను, త్రిప్పెను, మగిడించెను, మరల్చెను, ౪=ఆవర్తనముచేసెను. పాఱెను, వెళ్లెను, పరువెత్తెను ॥రూ॥ పరుగెత్తెను, పఱచెను, కదలెను, ఉఱికెను, తొలఁగెను, అటమరించెను, జరిగెను-౧౦ = పలాయితుఁ డయ్యెను.

సీ. గడుసరి దిట్ట మొక్కటి వాఁడిగలవాఁడు
వడికాఁడు పోటరి ✽ బంటు మేటి

మనసరి తెంపరి కె మొనకాఁడు మిడిమాసి
వడివాఁ డనంగ శూరుఁడు సెలంగు
నని చివ్వ యేడ్తెఱ కె యాలము బవరము
పోట్లాట పెనకువ కె పోరు కలను
కయ్యము దురము జగడ మన యుద్ధాఖ్య
లమరు మద్దత్తు వెన్నాస తోడు
తే. పాటు సావాసము పరాలు కె బాసట యన
రంజిలు సహాయమునకు వేరమ్ము కంటు
నూడు పగ దేస మనఁగఁ బొల్చును విరోధ
నామములు సర్వలోకైకనాథ సాంబ. 31

టీ. గడుసరి, దిట్ట, ఎక్కటి, వాఁడిగలవాఁడు, వడికాఁడు, పోటరి, బంటు, మేటి, మనసరి, తెంపరి, మొనకాఁడు, మిడిమాసి = వాఁడి గల మనుష్యుఁడు, వడివాఁడు-౧౩=శూరుఁడు. అని, చివ్వ, ఏడ్తెఱ, ఆలము, బవరము, పోట్లాట, పెనఁకువ, పోరు, కలను, కయ్యము (ప్ర. కలహము), దురము, జగడము-౧౨ = యుద్ధము. మద్దత్తు, వెన్నాస, తోడుపాటు, సావాసము, పరాలు, బాసట-౬ = సహాయము. వేరము, కంటు, నూడు, పగ, దేసము-౫=విరోధము.

సీ. నులిచె వెంపరలాడె కె నుగ్గాడెఁ దెగటార్చెఁ
జక్కాడెఁ బగదెంచెఁ జంపెఁ జెండె
సదమద మొనరించెఁ కె జదిపెఁ బీఁచమడంచెఁ
నులిమెఁ జాఁగఁబలాడెఁ కె బిలుకుమార్చెఁ
బరిమార్చె ముగియించె కె నుఱుము సేసె నడంచెఁ
దున్ఁించెఁ బొగరుమార్చెఁ కె దునిమె మడిపె
మన్నిగొనియె రూపుమాపె గీటడఁగించె

మడియించెఁ దూలించె § మలిపె ననఁగఁ
తే. బొనఁగు వధియించె ననుటకుఁ § బ్రోచెఁ బ్రోవె
సాఁకెఁ గాపాడె బ్రతికించె § సంతరించెఁ
బెంచె మనిపె ననఁగను బో§షించుట కగు
సకలసురచక్రవర్తి శ్రీ§సాంబమూర్తి. 32

టీ. నులిచెను, వెంపరలాడెను, నుగ్గాడెను, తెగటార్చెను, చక్కాడెను, పగదెంచె, చంపె, చెండెను, సదమదమొనరించె, చదిపెను, పీఁచమడఁచె ॥రూ॥ పించమడఁచె, నులిమె, చాఁగఁబలాడె, పిలుకుమార్చె, పరిమార్చె, ముగియించె, నుఱుముసేసె, అడఁచె, త్రుంచె, పొగరుమార్చె, తునిమె, మడిపెను, మన్నిగొనెను, రూపుమాపె, గీటడఁగించె, మడియించె, తూలించె, మలిపె-౨౮=వధించెను. ప్రోచె, ప్రోవె, సాఁకె, కాపాడె, బ్రతికించె, సంతరించె, పెంచె ॥రూ॥ పెనిచె, మనిపె ॥రూ॥ మనిచె, మంచె-౧౦=పోషించెను.

సీ. ఇచ్చ తలఁపు మది § యెద మన సనఁ జిత్త
మగుఁ దమకము మేలు § మరులు బాళి
తమి వలపు విరాళి § మమత నా మోహ మా
నాఁడాది యదిసుతఁ § నాఁటనుండి
తలనాఁడు నాఁడుమొ§దలు నాఁటఁబట్టి యా
నాఁడునిక్క యదిమొదల్ § నాఁటఁగోలె
యనఁగఁ దదారభ్య § యనుట కౌ మంచి మేల్
బాగు లెస్స యన శు§భంబు లలరు
తే. వనట యంగలారుపు వెత § వంత గోడు
బాద యంగద వగ పనఁ § బరఁగు బీడ
పదవి సిరి కల్మి యనఁగ సం§పదకు వెలయు
నితము పేరి మిం పన హిత § మెసఁగు సాంబ. 33

టీ. ఇచ్చ, తలఁపు, మది, ఎద, మనసు (ఇది తత్సమప్రాయము)-౫=చిత్తము. తమకము, మేలు, మరులు, బాలి, తమి, వలపు, విరాళి, మమత (ఇది తత్సమము)-౭=మోహము. నాఁడాది, అదినుత, నాఁటనుండి, తలనాఁడు, నాఁడుమొదలు, నాఁటఁబట్టి, ఆనాఁడున్కి, అదిమొదలు, నాఁటఁగోలె-౯=తదారభ్య యనుట. మంచి, మేలు, బాగు, లెస్స-౪ = శుభము. వనట, అంగలారుపు, వెత, వంత,గోడు, బాద (ప్ర. బాధ), అంగద, వగపు-౮ పీడ-అనఁగా నొప్పి. పదవి (ఇది తత్సమము), సిరి, కల్మి-౩=సంపద. ఇతము, పేరిమి, ఇంపు-౩=హితము.

సీ. జతపీడె నెడసె నాఁ గ జను విరహముపేరు
లెనసెఁ బైకొనెఁ బొందె గ నేలెఁ గలసె
నన సంగము మొనర్చె గ ననుట కొఁ బాలయల్క
వెడమోడి యనఁ బేర్లు గ వెలయుఁ బ్రణయ
కలహమునకు జడ గ గాంజ గంజా బంగి
యనఁగఁ గళంజాహ్వయంబు లలరు
నుబ్బు లాహిరి కైపు గ మ స్తన మత్తత
భాసిల్లుఁ దొడుసు నుంపడ మనంగ
తే. భోగవనితకుఁ దగు దెంపి గ ముసుకు కుంక
మాసకమ్మన విధవనామములు సెలఁగు
బైరవాసంబు దోవతి గ పంచె యనఁగ
నిల బహిర్వసనాభిఖ్య గ లలరు సాంబ. 34

టీ. జతపీడెను, ఎడసెను-౨ = ఎడఁబాసెను. ఎనసెను, పైకొనెను, పొందెను, ఏలెను, కలసెను-౫ = సంగమము చేసెను. పాలయలుక, వెడమోడి-౨=ప్రణయకలహము. జడ, గాంజ, గంజా, బంగి-౪ = కలంజము (గంజాయి). మబ్బు, లాహిరి, కైపు, మస్తు-౪మత్తత. తొడుసు - ఉంప

డము-౨ = భోగస్త్రీ. తెంపి, మునుకు, కుంక, మాసకమ్మ-౪ = విధవ, వై రవాసము ॥రూ॥ బయిరవాసము, దోవతి, పంచె-౪ = బహిర్వాసనము [బయటి వస్త్రము.]

సీ. విచ్చేసె నేతెంచె ♦ వచ్చెను వేంచేసె
నరుదెంచెఁ జనుదెంచె ♦ ననఁగ నాగ
తునిపేరు లగు మగఁతనము మగంటిమి
గం డనఁ బౌరుషాఖ్యలు చెలంగు
గద్దించె నదలించె ♦ గదిమెను నుఱిమె నా
గర్జించె ననుట కౌ ♦ గట్టి యుక్కు
చేగ యూట యుదుటు ♦ చేవ యుఱవు బిగు
వన దృఢత్వముపేరు ♦ లలరు జట్టి
తే. విలువ రో వెల యనఁ గ్రయాఖ్యలు దనర్చుఁ
గ్రపము సిరంబు గంబూర ♦ కప్పుర మన
వెలయుఁ జంద్రంబు వెల్గుక్క ♦ గిలుకుపలుకు
రవపలు కనంగ మణితాఖ్య ♦ లవును సాంబ. 35

టీ. విచ్చేసెను, ఏతెంచెను ॥రూ॥ ఏఁగుదెంచెను, వచ్చెను, వేంచేసెను, అరుదెంచెను ॥రూ॥ అరుగుదెంచెను, చనుదెంచెను - ౭ = వచ్చెను. మగతనము, మగఁటిమి, గండు - 3 = పౌరుషము. గద్దించెను, అదలించెను, గదిమెను, ఉఱిమెను-౪ = గర్జించె - బెదరించెను. గట్టి, ఉక్కు, చేగ, ఊట, ఉదుటు, చేవ, ఉఱవు, బిగువు-౭ = దృఢత్వము. జట్టి, విలువ, రో, వెల - ౫ = క్రయము. క్రపము, సిరము, గంబూర ॥రూ॥ గంబూరము-గంబురము, గంబురా, కప్పురము ॥రూ॥ కపురము-౭=కర్పూరము. వెల్గుక్క, గిలుకు పలుకు, రవపలుకు- 3 =మణితము-రతికూజితము.

సీ. లేమి పేదఱికము ♦ లేమిడి లేవడి

నిప్పచ్చర మిడుమ కె నెవ్వ యనఁగ
దారిద్ర్యనామముల్ కె తగు దెస యాత్రము
కడగండ్లు గోరము కె క స్తి బెడఁద
యడలు చేటన విపదాఖ్యలు వ ర్తిల్లుఁ
డెక్క మెగురఁగొట్టె కె డింకవేసెఁ
బెద్దనిద్దురవోయె కె బిద్దె మడిసెఁ జచ్చెఁ
జనె గంతుకొనెఁ ద్రుంగె కె సమసె నేఁగెఁ
తే. గూలె సీల్గెఁ గెడసెఁ ద్రెళ్లెఁ కె గ్రుంకె బ్రుంగెఁ
దెరలెఁ బోయె ముగిసె దీఱెఁ కె దొరఁగె ననఁగఁ
బరఁగు మృతునిసమాఖ్యలు కె బవిరి చుట్టు
వేఁడె మన వలయాభిధల్ కె వెలయుఁ సాంబ. 36

టీ. లేమి, పేదఱికము, లేమిడి, లేవడి, నిప్పచ్చరము, ఇడుమ, నెవ్వ-౭ = దారిద్ర్యము. దెస, ఆత్రము ॥రూ॥ అ త్తరము, కడగండ్లు (నిత్యబహువచనాంతము), గోరము, క స్తి, బెడఁద, అడలు, చేటు-౯ = విపత్తు. డెక్కమెగురఁగొట్టెను, డింకవేసెను, పెద్దనిద్దురవోయెను, బిద్దెను, మడిసెను, చచ్చెను, చనెను, గంతుకొనెను, త్రుంగెను, సమసెను, ఏఁగెను, కూలెను, ఈలిగెను, కెడసెను, త్రెళ్లెను, క్రుంకెను, బ్రుంగెను, తెరలెను, పోయెను, ముగిసెను, తీఱెను, తొరఁగెను - ౨౨ = మృతినొందెను. బవిరి, చుట్టు, వేఁడెము-౩=వలయము.

సీ. గమి పౌఁజు మొ త్తము కె కదుపు చేరువ బారు
పిండు కూటువ పరి కె దండు దిమ్ము
గుంపు తుటుము గుమి కె గూటు పదు పనంగ
బృందాఖ్య యగు వెళ్లె కె వెడలె వెలలె
వెలువడె ననఁ బేళ్లు కె వెలయు నిర్గతుఁ డంట

కెన్నఁడు వాలాయ | మెపుడు నిచ్చ
లెల్లప్పు డెప్పటి | కేప్రొద్దు నెడప కే
నాఁ డెప్పు డుడుగక | నాఁ జెలంగు
తే. సంతతాఖ్య కొలము వంగ|సమ్ము వంగ
డ మ్మనఁ గులాఖ్య వర్తిల్లుఁ | గ్రమ్మఱ మఱి
మగుడ వెండియుఁ బలుమఱు | మరల సారె
తిరుగ ననఁ బునరాఖ్యలు | పరఁగు సాంబ.

టీ. గమి, పోఁజు, మొత్తము, కదుపు, చేరువ, బారు, పిండు, కూటువ, పరి, దండు, దిమ్మ, గుంపు, తుటుము, గుమి, కూటు, పదుపు-౧౬= సమూహము. వెళ్లె, వెడలె, వెలలె, వెలువడె-౪ = నిర్గతుఁడయ్యె-ప్రయాణమాయెను. ఎన్నఁడు, వాలాయము, ఎపుడు, నిచ్చలు ॥పా॥ నిచ్చ, ఎల్లప్పుడున్, ఎప్పటికిన్, ఏప్రొద్దును, ఎడపక, ఏనాఁడు, ఎప్పుడున్, ఉడుగక, ౧౧=సదా. కొలము, వంగసము, వంగడము-3=కులము. క్రమ్మఱన్, మఱి, మగుడన్, వెండియున్, పలుమఱు, మరలన్, సారె, తిరుగన్-౮=పునః.

సీ. పంద కోఁచ పిఱికి | పాఱుఁబోతనఁగను
సమరభీరునిపేరు | లమరుచుండు
విడియము వీడెంబు | వీడ్యము వక్కాకు
తములము బాగాలు | తమ్ములంబు
నాఁ జనుఁ దాంబూల|నామముల్ కొనియాడె
నగ్గించెఁ బొగడెఁ గొం|డాడె నెంచెఁ
గైవారమొనరించె | నా వినుతికిఁ బేళ్లు
క్రచ్చు కోరిక కోర్కి | యిచ్చ యనఁగ
తే. నిచ్ఛ కగు రోసెఁ బరికించె | నెమకెఁ దడవె
వెదకె నారసె నరసెను | వెతకె ననఁగఁ

దనరు నన్వేషణాఖ్యలు ౯ తన్నెఁ దాఁచె
నడుగుతాటించెఁ గాళ్లచే ౯ నడిచె ననఁగ
నమరుఁ బదతాడనాభిధానములు సాంబ. 38

టీ. పంద, కోఁచ, పిటికి, పాలుఁబోతు (పాలు + పోతు)-౪=యుద్ధభీరువు. విడియము, వీడెము, వీడ్యము, వక్కాకు, తములము, బాగాలు, తమ్మలము-౬=తాంబూలము. కొనియాడె, అగ్గించె, పొగడె, కొండాడె, ఎంచె, కైవారమొనరించె-౬ = స్తోత్రముచేసెను. క్రచ్చు, కోరిక, కోర్కి, ఇచ్ఛ-౪=ఇచ్ఛ. రోసె, పరికించె, సెమకె, తడవె, వెదకె, అరసె, అరసె, వెతకె-౮=అన్వేషించెను. తన్నె, తాఁచె, అడుగుతాటించె, కాళ్లచేనడిచె-౪ = పాదముతోఁ దన్నెను.

సీ. కొమరు చొక్కాటమ్ము ౯ గొనబు చొకారము
చొక్కము మేలిమి ౯ జోఁక పొలుపు
నాణెంబు సొరు వినన్నాణంబు తిన్నన
పరఁగు చొక్కా చెల్వు ౯ మురువు తనరు
నగు తియ్య పొనరు చెన్నలరు నలువు తీరు
వటులు జాను చెలంగు ౯ కొటలు నెనరు
చను తగు నొప్పు నెసంగు ననెడుపేళ్లు
తగు మంజులమునకు ౯ దండ యొద్ద

తే. చెంత కుటఁగలి డగ్గఱ ౯ చేర్వ పొంత
దాపు సరస కెలను పజ్జ ౯ ప్రాపు వద్ద
యండ చక్కి గరిడి యన ౯ నమర నా స
మీపనామములు మనోజ్ఞరూప సాంబ. 39

టీ. కొమరు, చొక్కాటము ॥రూ॥ చొకాటము - చొక్కటము, గొనబు, చొకారము, ॥రూ॥ చొక్కారము, చొక్కము, మేలిమి,

బ్లోఁక, పొలుపు, నాణెము, సొరు, విన్నాణము, తిన్నన, పరఁగు, చొక్కా ॥రూ॥ చొక్క-చొకా (ఈ 3 ను, చొక్కమునకు వృత్తిని మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపములు), చెల్వు, మురువు, తనరు, అగు, తియ్యు, పొనరు, చెన్ను, అలరు, నలువు, తీరు, నఱలు, జాను, చెలఁగు, కొలలు, ఒనరు, చను, తగు, అమరు, ఒప్పు, ఎసఁగు-౨౦ = మంజులమైనది. దండ, ఒద్ద, కుఱఁగలి, డగ్గఱ ॥రూ॥ దగ్గఱ, చేర్వ ॥రూ॥ చేరువ, పొంత, దాపు, సరస, కెలను, పజ్జ (ప. పశ్చాత్), ప్రాపు, వద్ద, అండ, చక్కి, గరిడి-౧౭=సమీపము.

సీ. పిమ్మటఁ దరువాతఁ బిదప వెన్క వెనుక
	ననఁగఁ బశ్చాదభిఖ్యలు చెలంగు
సడలె వదలె ప్రీలె జాఱె వీడె ననంగఁ
	జ్యుతసమాఖ్య లగు లొచ్చు కొద కడమ
కుఱుచ యొచ్చెము తగ్గు కొంచెము తక్కువ
	కుందు కొదవ లోను కొద్ది యనఁగ
మెఱయు న్యూనతపేళ్లు మిక్కిలి యెక్కువ
	యెచ్చు పెల్లుదనము పెచ్చు మిగుల
తే. హెచ్చనఁగ నధికాభిఖ్య లెసఁగు చుండుఁ
	దొలుత ముందర మున్ మున్ను తొల్లి మునుపు
	ముందు మును తొలి యనఁ జనుఁ బూర్వమునకుఁ
	దడవు జాగన నాలస్య మడరు సాంబ. 40

టీ. పిమ్మటు, తరువాత (తరువాయి సప్తమ్యేకవచనము), పిదప,వెన్క, వెనుక-౫ = అనంతరము. సడలె, వదలె, ప్రీలె, జాఱె, వీడె-౫ = చ్యుతమయ్యె. లొచ్చు, కొద, కడమ, కుఱుచ, ఒచ్చెము, తగ్గు, కొంచెము, తక్కువ, కుందు, కొదవ, లోను, కొద్ది-౧౨ = న్యూనత. మిక్కిలి, ఎక్కువ, ఎచ్చు, పెల్లుదనము, పెచ్చు, మిగులన్, హెచ్చు-౭=అధికము. తొలుతన్,

ముందర ॥పా॥ ముందఱ, మున్ను, తొల్లి, మునుపు, ముందు, మును, తొలి-
గ=పూర్వము. తడవు, జాగు-౨ = ఆలస్యము.

సీ. తాౘుమాౘుయ్యెను * దడఁబడె వీడ్వడె
        నన విపర్యాసాఖ్య * లమరు సాము
    సగము సాఁబా లనఁ * దగు నర్ధ మనుటకుఁ
        దూఁకొనెఁ జొరఁబాఱెఁ * దూఱెఁ జొచ్చె
    ననఁగఁ బ్రవేశించె * ననుటకుఁ దనరారు
        మొత్తెఁ గొట్టెను వ్రేసె * మోఁదె ననఁగఁ
    బ్రహరించె ననుట కౌఁ * బనిచె ననిచెఁ బుచ్చె
        నంపెఁ బుత్తెంచెఁ బొమ్మనియెఁ బంపె
తే. గెలువు మనె ననఁ బ్రస్థితాఖ్యలు చెలంగుఁ
    జాయ పొంత నఁ జోటనఁ * బాయ యిక్క
    చక్కి తా వనఁగఁ బ్రదేశసంజ్ఞ దనరు
    నంబరనదీలసజ్జటాడంబ సాంబ. 41

టీ. తాౘుమాౘుయ్యెను, తడఁబడెను, వీడ్వడెను-3 = విపర్యాసము (తలక్రిందు). సాము, సగము, సాఁబాలు- 3 = అర్ధము. తూఁకొనెను, చొరఁబాఱెను, తూఱెను, చొచ్చెను- 3 = ప్రవేశించెను. మొత్తెను, కొట్టెను, వ్రేసెను, మోఁదెను- ౪ = ప్రహరించెను. పనిచెను (పోవుధాతుప్రేరణము), అనిచెను, పుచ్చెను (పోవుధాతుప్రేరణము), అంపెను, పుత్తెంచెను, పొమ్మనియెను, పంపెను, గెలువుమనెను-౭ = ప్రయాణముసేయించెను. చాయ, పొంత, చోటు, పాయ, చక్కి, తావు-౬ = ప్రదేశము.

సీ. అచట నయ్యెడ నందు * నచ్చో నదిగొ నట
        నచ్చట నక్కడ * నకడ నాడ
    నానంక నల్లదె * యనఁ దత్ప్రదేశాఖ్య

లోఁదవు ముంగల మ్రోల । నెదుట ముందు
ముందట యనఁగ సమ్ముఖముపేళ్లు రహించు
నిరుదెస లిరువంక । లిరుగెలంకు
లిరుప్రక్క లిరుమైల । లిరుగ్రేవ లిరుగడల్
నూరె లనెడిపేళ్లు । మీఱు నుభయ
తే. పార్శ్వనామముల్ వడసెందె । బాళితాఁకె
మైమఱచెఁ గడపట్టె సొమ్మసిలె ననఁగ
మూర్ఛ కొఁ గికురించెను । మోసపుచ్చెఁ
బిక్కచేసె నా వంచనపేళ్లు సాంబ. 42

టీ. అచటఁ, అయ్యెడఁ, అందుఁ, అచ్చోటఁ, అదిగో ॥రూ॥ అదె, అటఁ, అచ్చటఁ, అక్కడఁ, అకడఁ, ఆడఁ, ఆవంకఁ, అల్లదె ॥రూ॥ అల్లదిగో - ౧౮ = ఆప్రదేశమునందు. ముంగల, మ్రోల, ఎదుట, ముందు, ముందట-౫=సమ్ముఖము. ఇరుదెసలు, ఇరువంకలు ॥రూ॥ ఇర్వంకలు, ఇరుగెలఁకులు, ఇరుప్రక్కలు, ఇరుమైలలు, ఇరుగ్రేవలు, ఇరుగడలు, నూరెలు-౯ = ఉభయపార్శ్వములు. ఎడసెందెను, బాళితాఁకెను, మైమఱచెను, కడపట్టెను, సొమ్మసిల్లెను-౫=మూర్ఛనొందెను. కికురించెను, మోసపుచ్చెను, పిక్కచేసెను-౩=వంచించెను.

సీ. వెఱ బీతు దిగు లళ్కు । వెఱ పదరు బెదరు
జళుకు కెద జడుపు పస । వెలయు భయము
కత్తి వా లడిదము । కైదువు నన ఖడ్గ
మెసఁగు బల్లెము గడ । యీఁటె చివ్వ
యనఁగఁ గుంతాఖ్య లౌ । నామెత పండుగ
పబ్బం బనఁగ నుత్సవమున కలరు
వంక వంకర సొట్ట । డొంకన వక్రత

చెలఁగు దుడుకు లూటి జులిమి దుండ
తే. గమ్మనఁగ నుద్ధతాఖ్య లౌఁ గాని వల్లె
మంచిది యనంగఁ దగు సమ్మతించుటకును
గుఱుచ యరచట్ట దుత్తాయి కుబుస మనఁగ
నమరుఁ గూర్పాసనామధేయములు సాంబ. 43

టీ. వెఱ, బీతు (ప్ర. భీతి), దిగులు, అళుకు ॥రూ॥ అళుకు, వెఱపు, అదరు, బెదరు, జళుకు, ఎద, జడుపు-౧౧ = భయము. కత్తి, వాలు, అడిదము, కైదువు-౪=ఖడ్గము. బల్లెము, గడ, ఈఁటె, చివ్వ-౪=కుంతము. ఆమెత, పండుగ ॥రూ॥ పండుగు-పండువు, పబ్బము- ౭ = ఉత్సవము. వంక, వంకర, సొట్ట, డొంక-౪=వక్రత. దుడుకు, లూటి, జులిమి, దుండగము-౪ = దౌష్ట్యము. కాని, వల్లె, మంచిది-౩ = సమ్మతమును సూచించుట. కుఱుచ, అరచట్ట, దుత్తాయి, కుబుసము-౪=కూర్పాసము-అవిక.

సీ. పావాలు పావలు పావుకోళ్లనఁ జెల్లుఁ
బాదుకాభిఖ్యలు పాయపోసు
లూడ్పులు పాపోసు లుద్దనుల్ మెట్లు చె
ప్పు లనఁగఁ బాదరక్షలకుఁ దనరు
నంగడి బాజారనంగ విపణి పొల్చు
గొన నుల్లె నారి నా గుణము పరఁగు
మొన యొడ్డనఁగ వ్యూహమున కగుఁ బెడబొబ్బ
యార్పన సట్టహాసాఖ్య లెసఁగు
తే. లావు సత్తువ యనఁగ బలంబు చెలఁగు
నట్ట మొండెమనఁగఁ గబంధాఖ్య లలరు
దూల నవ తీఁట యనఁగఁ గండూతి కొనరు
శంబరాహితమదభిదాడంబ సాంబ. 44

టీ. పావాలు, పావలు, పావుకోళ్లు-3=పాదుకలు (ఇవి కొయ్యతో చేయఁబడునవి), పాయపోసులు, ఊడ్పులు, పాపోసులు, ఉద్దములు, మెట్లు, చెప్పులు-౬=పాదరక్షలు. (తోలితో చేయఁబడునవి). అంగడి, బాజారు (అన్యదేశ్యము)-౨ = విపణి. గొనము, అల్లె, నారి-3=వింటియల్లెత్రాడు. మొన, డ్డు-౨=వ్యూహము. పెడబొబ్బ, ఆర్పు- ౨ = అట్టహాసము. లావు, సత్తువ, త్త్వము)-౨=బలము. అట్టు, మొండెము - ౨ = కబంధము-తలతెగిన శరీరము. దూల, నవ, తీఁట-3=కండూతి-దురద.

సీ. విలు విల్లు సింగాణి ♦ విల్ సింగిణి యనంగఁ
గోదండమున కగుఁ ♦ గోపు కొప్పు
నాఁ జను ధనురగ్ర ♦ నామంబులు లకోరి
యంపజ నారస ♦ మమ్ము తీరు
ములికి సరము కోల ♦ చిలుకు తూపన శరా
ఖ్యలు మించు మైనర్వ ♦ కమరు జోడు
దగళా జిరాయి బొం ♦ దళము దుప్పటమును
జిలుకత్తు బందనఁ ♦ జెలఁగుఁ గవచ
తే. మరద మనఁ దేరనఁగ రథం ♦ బమరు హాయిలు
బండి కొల్లారుబండి నాఁ ♦ బరఁగు గోశ
తాంగనామముల్ మునికోల ♦ యారెకోల
ముల్లుకో లనఁ దోత్రంబు ♦ మొనయు సాంబ. 45

టీ. విలు, విల్లు, సింగాణి, విల్, సింగిణి ॥రూ॥ సింగిణీ - ౬ = కోదండము (ధనుస్సు). కోపు, కొప్పు- ౨ = వింటికొప్పు, లకోరీ ॥రూ॥ లకోరి. అంపజ, నారసము (ప్ర. నారాచము), అమ్ము, తీరు, ములికి, సరము, కోల, చిలుకు, తూపు-౧౧ = బాణము. మైమర్వ ॥రూ॥ మైమఱువు, కమరు, జోడు, దగళా, జిరాయి, బొందళము, దుప్పటము, చిలుకత్తు, బందు -

౧౦ = కవచము. అరదము, (ప్ర. రథము), తేరు-౨=రథము. హాయలుబండి, కొల్లారుబండి ॥రూ॥ కొలారుబండి-కొల్లాబండి-౪=గోళతాంగము (గాడీ). మునికోల, ఆరెకోల, ముల్లుకోల ॥రూ॥ ములుకోల-౪ = తోత్రము (చబుకు).

సీ. దీవట్లు పంజులు ౹ దివ్వటీల్ దివటీలు
దివియ లనం గరదీపిక లగు
నొగ కాఁడిమ్రాఁ కనఁ ౹ దగుఁ గూబరము కాన్క
కానుక కూడిద ౹ కప్ప మనఁగఁ
గరముపే ళ్లగు గద్దె ౹ గద్దియ యనఁగ సిం
హాసననామంబు ౹ లమరు గొటిజ
గొల్లెనయు గుడారు ౹ గూడార మనఁ దగుఁ
బటకుటీరము నొప్పి ౹ బాద యలఁత
తే. తెగులు తెవు లన రోగాఖ్య ౹ లగును వెజ్జు
మందరి యనంగ వైద్యనామంబు లెసఁగు
దండ చేరు సరము పేరు ౹ తావడంబు
సరి యనఁగ హారనామముల్ ౹ పొరయు సాంబ. 46

టీ. దీవట్లు, పంజులు, దివ్వటీలు, దివటీలు, దివియలు-౫ = కరదీపికలు. నొగ, కాఁడిమ్రాఁకు-౨ = కూబరము. కాన్క, కానుక ॥రూ॥ కానిక, కూడిద, కప్పము-౫ = కరము (పన్ను). గద్దె, గద్దియ - ౨ = సింహాసనము. గొటిజ, గొల్లెన ॥రూ॥ గొల్లియన, గుడారు ॥రూ॥ గుడారము, గూడారము-౬ = పటకుటీరము (డేరా). నొప్పి, బాద (ప్ర. బాధ), అలఁత, తెగులు, తెవులు-౫=రోగము. వెజ్జు (ప్ర. వైద్యుఁడు), మందరి-౨ = వైద్యుఁడు. దండ, చేరు, సరము, పేరు, తావడము ॥రూ॥ తావళము, సరి-౭=హారము.

సోబె సిబ్బె మనఁ బొకల్చును గిలాసము కొంగు
చెఱఁగు చుంగన నెప్పుఁ ౹ జేలముతుద

నెయ్యి నే చము రన నెగడు నాజ్యముపేళ్లు
తైలాఖ్య యగు నూనె తలచము రన
దివ్వెచమురు నామిదెము నాముదంబన
నేరండతైలాఖ్య లెసఁగుఁ గోపు
సారాయి యనఁ జెల్లు వారుణీనామముల్
తిలపిష్టమున కగుఁ దెలికపిండి
తే. గాన్గుపిండి యనంగఁ దక్రంబు వెలయుఁ
జల్ల మజ్జిగ యన దధిసంజ్ఞ దనరుఁ
బెరుఁగు కలు పన గోరంట బెల్ల మచ్చు
నా గుడాభిఖ్య లగు జగన్నాథ సాంబ. 47

టీ. సోబె, సిబ్బెము-౨=కిలాసము. కొంగు, చెఱఁగు, చుంగు-3 = వస్త్రముకొన. నేయి, ॥రూ॥ నెయ్యి, నే, చమురు-౪=ఘృతము. నూనె, తలచమురు-౨=తైలము. దివ్వెచమురు, ఆమిదెము, ఆముదము - 3 = ఏరండతైలము. కోపు, సారాయి-౨ = మద్యము. తెలికపిండి, గాన్గుపిండి-౨ = తిలపిష్టము. చల్ల, మజ్జిగ-౨ = తక్రము. పెరుఁగు, కలుపు-౨ = దధి. గోరంట, బెల్లము, అచ్చు-3=గుడము.

సీ. ఒడమెలు సొమ్ములు తొడవు లనఁగఁ జెల్లు
భూషణాఖ్యలు విత్తమునకు రూక
ధనము రొక్క మనంగఁ దనరు మేలుతరంబు
మేల్బంతి కన్నాకు మీసరంబు
తలకట్టు నాఁగ భాసిలు శ్రేష నామంబు
లనఁబడు నాఁగ నా ననఁగ నావు
డనఁగఁ జెల్లు ననంగ ననెడి పేరులకు విం
జామరము లన వింజామర లన

తే. జమిడివీచోపు లనఁ జామరములకౌన
వాతు కల్కండ చక్కెర పంచదార
కండచక్కెర మేలుపులకండ మనఁగ
శర్కరాభిఖ్య లగు శైలచాప సాంబ. 48

టీ. ఒడమెలు (ఇది అజవపదము), సొమ్ములు (ప్ర. స్వమ్), తొడవులు-3 = భూషణములు. రూక, ధనము (ఇది తత్సమము), రొక్కము (ప్ర. రుక్మము) 3 = విత్తము. మేలుతరము, మేల్బంతి, కన్నాకు, మీసరము, తలకట్టు-5=శ్రేష్ఠము. అనవుడున్, నాఁగన్, నాన్, అనఁగన్, నావుడున్-5=అనఁగా. వింజామరములు, వింజామరలు, జమిడివీచోపులు-3 = చామరములు. నవాతు, కల్కండ, చక్కెర, పంచదార, కండచక్కెర, మేలుపులకండము- ౬=శర్కర.

సీ. సైకము తోడెము సన్న మన్నన జిల్గు
పలిపము చిఱు లేఁత కొలఁది యలఁతి
యసదు లే జీబన నమరు స్వల్పమునకుఁ
బెను గొప్ప బలు పేరు పెద్ద దొడ్డ
గన మన నధికాఖ్య లొనరుఁ దొంటము హొమ్మ
గమలక మొ మ్మనఁగ స్థూలము చెలంగు
డస్సెఁ గుందె ముడింగెఁ దాఁకె నుబ్బడఁగెను
మగ్గెఁ గ్రుంగెను డొంకె సగ్గుసొక్కెఁ
తే. దగ్గె నన క్షీణదశ కగు డబ్బు బద్దు
పొల్లు డబ్బఱ తాటోటు బొంకు రవళి
కల్ల జూదన నన్నృతెంబు పేళ్లు వెలయు
నిలుకడ యనంగ నిరతాఖ్య నెగడు సాంబ. 49

టీ. సైకము,తోడెము,సన్నము, అన్నన, జిల్గు॥రూ॥ జిలుఁగు,వలిపము,

చిఱు, లేఁత, కొలఁది, అలఁతి, అసదు, లే, జీబు - ౧౪ = స్వల్పము. పెను, గొప్ప, బలు, పేరు, పెద్ద, దొడ్డ, గనము-౭ = అధికమైనది. తోరము, హొమ్మ్రు, గమకము, ఒమ్మ్రు-౪=స్థూలము. డస్సెను, కుందెను, ముడిఁగెను, తాఁకెను, ఉబ్బడఁగెను, మ్రగ్గెను, క్రుంగెను, డొంకెను, సగ్గెను, మ్రుక్కెను, తగ్గెను - ౧౧ = క్షీణించెను. డబ్బు, బద్దు, పొల్లు, దబ్బర ॥రూ॥ డబ్బఱ, తాటోటు, బొంకు, ఱవలి ॥రూ॥ తవలి, కల్ల, జూదు - ౧౧ = అసత్యము. నిఱుకడ=నిరతము.

సీ. ఎంచె గణుతిచేసె । నెన్నికనిడె నెన్నె
    ననఁగ గణించుట । కనురుఁ దాల్మి
సైరణ యోర్పన । శాంతతపేళ్లగు
    నెమ్మి నెమ్మది హాయి । నిమ్మళంబు
నాఁగ నిరాతంక । నామము లగు వడ
    యలయిక బడలిక । యలపు సేద
యనఁగ శ్రమాఖ్య లౌ । నగ్గలంబాయెను
    మేరతప్పెను మట్టు । మీఱె మించె
తే. వెక్కసం బయ్యె నుఱవయ్యెఁ । గ్రిక్కిఱిసెను
ననఁగ నుత్కృష్ట మనుట కౌ । నావరించె
నిండె నెగడె వెలసెఁ బర్వె । నిగిడె ననఁగ
వ్యాప్త మయ్యె ననెడిపేళ్లు । కలరు సాంబ. 50

టీ. ఎంచెను, గణుతిచేసెను, ఎన్నికనిడెను, ఎన్నెను-౪ = గణించుట. తాల్మి ॥రూ॥ తాలిమి, సైరణ ॥రూ॥ సయిరణ, ఓర్పు ॥రూ॥ ఓరుపు-౬=శాంతత్వము. నెమ్మి, నెమ్మది (నెఱ+మది), హాయి,నిమ్మళము-౪=నిరాతంకము. వడ, అలయిక, బడలిక, అలపు, సేద-౫ = శ్రమము. అగ్గలమయ్యెను, మేరతప్పెను, మట్టుమీఱెను, మించెను, వెక్కసమయ్యెను, ఉఱవ

య్యెను, క్రిక్కిఱిసెను-౭=ఉత్కృష్టమయ్యెను. ఆవరించెను, నిండెను, నెగడెను, వెలసెను, పర్వెను, నిగిడెను-౬=వ్యాపించెను.

సీ. అవసడి యాడిక ♦ యాఱడి సడి ఱట్టు
నగడు దూ ఱన నింద ♦ కమరు మాల్మి
యలవాటు వాడుక ♦ యలవడు టనఁ బొల్పుఁ
బరిచయాభిఖ్యలు ♦ పన్నిదంబు
పందెము జూద మనఁ దగు ద్యూతంబు
నిబ్బది నిక్కము ♦ నిలువరంబు
నిజము నిక్కువ మన ♦ నెగడు సత్యముపేళ్లు
గోర్వంక నెలకూన ♦ గోటినాటు
తే. నా నఖక్షత మగును దంతక్షతములు
కెరలుఁ బలునొక్కు వాతెఱకెంపు పెదవి
గంటి కెమ్మోవిగుఱి యనఁ ♦ గౌఁగిలి యనఁ
గవుఁగి లనఁగ నాలింగనాఖ్య లగు సాంబ.

టీ. అవసడి, ఆడిక, ఆఱడి, సడి, ఱట్టు, అగడు, దూఱు-౭ = నింద. మాల్మి ॥రూ॥ మాలిమి, అలవాటు, వాడుక, అలవడుట - ౫ = పరిచయము. పన్నిదము, పందెము, జూదము ॥రూ॥ జూజము (ప్ర. ద్యూతము) - ౪ = ద్యూతము. నిబ్బది, నిక్కము, నిలువరము, నిజము, నిక్కువము-౫ = సత్యము. గోర్వంక ॥రూ॥ గోరువంక, నెలకూన, గోటినాటు - ౪ = నఖక్షతము. పలునొక్కు, వాతెఱకెంపు, పెదవిగంటి, కెమ్మోవిగుఱి-౪ = దంతక్షతము. కౌఁగిలి, కవుఁగిలి-౨=ఆలింగనము.

సీ. నాగకేసరులు చెన్నంగులు కురువులు
భోజనప్రియములు ♦ రాజనములు
గన్నెఱు లిప్పపూల్ ♦ గంగాజలంబులు

మట్టకారులు పూలమంజరీలు
పెద్దవంకలు పాలవెల్లులు ముత్తెపు
సరులు సంబాపులు చంద్రవంక
లేనుఁగుకొమ్ములు మానికములు వన్నె
పూలు సీతాభోగము లన శాలి
తే. ధాన్య మొసఁగును దూము ముంత ముకుసంబు
బల్ల కుంచము సోల తవ్వ పడి యడ్డ
గరిసె పుట్టి సెలగ మెడా కల మనంగ
ధాన్యములు గొల్చువానికి దగును సాంబ. 52

టీ. నాగకేసరులు, చెన్నంగులు, కురువులు, భోజనప్రియములు, రాజనములు, గన్నెలులు, ఇప్పపూలు, గంగాజలములు, మట్టకారులు, పూలమంజరీలు, పెద్దవంకలు, పాలవెల్లులు, ముత్తెపుసరులు, సంబాపులు, చంద్రవంకలు, ఏనుఁగుకొమ్ములు, మానికములు, వన్నెపూలు, సీతాభోగములు, ఈ ౧౯ యును వడ్లవిధములపేళ్లు. తూము, ముంత, ముకుసము, బల్ల, కుంచము, సోల, తవ్వ, పడి, అడ్డ, గరిసె, పుట్టి, సెలగ, మెడా, కలము - ఈ ౧౪ ను= ధాన్యములు కొల్చుసాధనములపేళ్లు.

క. ఇమ్మనుజవర్గు జేసితి
సమ్మదమున దీని వినినజనులు బళా చో
క్క మ్మనఁగా నెంతయు నన
ఘ మ్మనఁగా మహిని వెలయఁగావుత సాంబా 53

తా. ఈ మానవవర్గును రచించినాఁడను. ఇది వినునట్టిజనులు 'బలారే యెంతచొక్క మైనది నిర్దుష్ట మైనది' అనఁగా, భూమియందుఁ బ్రసిద్ధి నొందునుగాత.

మానవవర్గు - సమాప్తము.

## స్థావరవర్గు.

---

క. శ్రీవరదాయక పాయక
దేవరనామాంకితముగఁ దేటపఱిచెదఁ
స్థావరవర్గును గవితా
భావరసజ్ఞు లెద మెచ్చఁ బశుపతి సాంబా. 54

తా. సంపత్కరము లగువరముల నిచ్చువాఁడా! పశుపతీ! సాంబమూర్తీ! కవిత్వప్రభావమును రసమును నెఱింగినవారు మెచ్చుకొనునట్లు స్థావరవర్గును నెడతెగక నీపేర నంకితముగా విశదపఱుచుచున్నాను.

సీ. ఇలతాల్పు గట్టు గుబ్బలి కొండ మల తిప్ప
యన శైలనామంబు లమరు మంచు
టిలతాల్పు వడఁకుగుబ్బలి దుగ్గికన్నయ్య
గట్లరాయఁడు బేసికంటిమామ
చలికొండ వలిమల పులుచూలితాత నా
హిమగిరినామంబు లెసఁగుఁ బసిఁడి
గట్టు వేల్పులమన్కిపట్టు క్రొన్నెలదారి
సింగిణి యన మేరుశిఖరి వొల్చు
తే. విసపుమేఁతరిబలుజెంకి వెండికొండ
తెలిమల యనంగ రజతాద్రి తేజరిల్లు
బటువుమల తుదగట్టనఁ బరఁగుఁ జక్ర
వాళగిరిపేళ్లు త్రిభువనవంద్య సాంబ. 55

టీ. ఇలతాల్పు = భూమిని ధరించినది, గట్టు, గుబ్బలి, కొండ, మల, తిప్ప - ౬ = పర్వతము. మంచుటిలతాల్పు = మంచుకొండ, వడఁకుగుబ్బలి = చలికొండ, దుగ్గికన్నయ్య = దుర్గను (పార్వతిని) కన్నతండ్రి, గట్లరాయఁ

డు=పర్వతరాజు, జేసికంటిమామ = శివునిమామ, చలికొండ, వలిమల, పులు చూలితాత = అల్లుకసవునఁ బుట్టినకుమారస్వామికి పితామహుఁడు - ౮ = హిమవంతుఁడు. పసిఁడిగట్టు = బంగారుపర్వతము, వేల్పుల...పట్టు=దేవతల వాసస్థానమైనది, క్రొన్నె...సింగిణి = లేఁతచంద్రుని ధరించినశివునికి విల్లైనది-3 =మేరుపర్వతము. విసపు...మెంకి=విషమును భక్షించిన శివునిగొప్పస్థానము, వెండికొండ, తెలిమల = తెల్లనికొండ-3 = కైలాసపర్వతము. బటువుమల=గుండ్రనైనకొండ, తుదగట్టు = కడపట నుండుకొండ - ౨ = చక్రవాళపర్వతము.

సీ. కవ్వపుమల తరికొగట్టన మందరం
బడరుఁ దూరుపుమల కొ పొడుపుఁదిప్ప
మొదటికొండ యనంగ కొ నుదయాచలం బొప్పుఁ
బడమటిమల క్రుంకుకొపుడమితాల్పు
నా న స్తగిరి కగు కొ తాయి తా కల్లనఁ
బ్రస్తరాఖ్య దలిర్చుఁ కొ బల్లె యూరు
కుప్పం బనఁగ గ్రామ కొ మొప్పును బ్రోలు వీ
డనఁ బట్టణముపేరు కొ లలరుచుండు

తే. నిరవు మెంకి యునికి యిక్క కొ యిలు గీము
మనికి పట్టు బిడారు కొంపొప యిలు నెలవు
నట్టు తా వన మందిరకొనామము లగు
శంబరాహితమదభిదాకొడంబ సాంబ. 56

టీ. కవ్వపుమల=(సముద్రమును చిలికినపుడు) కవ్వముగానుండినకొండ, తరిగట్టు = (సముద్రమును) చిలికినకొండ - ౨ = మందరపర్వతము. తూరుపుమల=తూర్పుదిక్కుననుండుకొండ, పొడుపుఁదిప్ప = ఉదయపర్వతము, మొదటికొండ-3=ఉదయపర్వతము. పడమటిమల = పడమటనుండుకొండ, క్రుంకు

పుడమితాల్పు=అస్తమించు పర్వతము-౨=అస్తగిరి. ఱాయి, ఱా, కల్లు-3=శిల. పల్లె, ఊరు, కుప్పము - 3 = గ్రామము. ప్రోలు, వీడు-౨=పట్టణము. ఇరవు ॥రూ॥ ఇరువు, టెంకి, ఉనికి, ఇక్క, యిల్లు, గీము (ప్ర. గృహము)- మనికి, పట్టు, బిడారు, కొంప, ఇలు, నెలవు, నట్టు, తావు (అన్యదేశ్యము)- ౧౫=మందిరము.

సీ. టెంకాయచెట్టన తేంగ్రమాను నారిక
డం బన నారికేళంబు దనరుఁ
దా డనఁ దాళ మా దాళిమ్మ దానిమ్మ
యన దాడిమియుఁ బొన్న పొన యనంగఁ
బున్నాగముఁ దనర్చు గన్నేఱు గన్నెఱు
నాఁగను గరవీరనామము లగు
రేఁగు రే నన బదరికిఁ జెల్లు మారేడు
బిలువ మనఁ దనర్చు బిల్వమునకు
తే. జమ్మి జంబన శమి యగుఁ జంపకంబు
దనరు సంపెఁగ సంపఁగె యనఁగ నెల్లి
యుసిరి యుసిరిక యన ధాత్రి యొప్పు రాగి
యనఁగ రావన నశ్వత్థ మొనరు సాంబ. 57

టీ. టెంకాయచెట్టు ॥రూ॥ తెంకాయచెట్టు, తేంగ్రమాను ॥రూ॥ తేంగ్రమాను, నారికడము-౫=నారికేళము. తాడు=తాళవృక్షము (తాటిచెట్టు). దాళిమ్మ, దానిమ్మ ॥రూ॥ దాడిమ్మ-3=దాడిమి. పొన్న, పొన-౨=పున్నాగవృక్షము. గన్నేఱు, గన్నెఱు-౨=కరవీరము. రేఁగు, రేను-౨=బదరి. మారేడు, బిలువము-౨ = బిల్వము. జమ్మి, * జంబు-౨ = శమీవృక్షము. సంపెఁగ, సంపఁగె ॥రూ॥ సంపఁగియ-3 = చంపకము. నెల్లి, ఉసిరి, ఉసిరిక-3=ధాత్రి. రాగి, రావి-౨=అశ్వత్థము.

* ఇది శమీవృక్షనామ మగుట విచార్యము.

సీ. అత్తి మేడి యనంగ ఽ నౌదుంబరం బొప్పు
మావి మామి డన నాఽమ్రము దనర్చు
వెలఁగ వెలంగ నా ఽ వెలయుఁ గపిత్థంబు
మల్లె మల్లియ నాఁగ ఽ మల్లిక యగు
జాజి జాది యనంగ ఽ జాతి యౌా నేరేడు
నేరెడు నా జంబు ఽ నెగడుచుండుఁ
బాదిరి కలిగొట్టు ఽ నాఁ దగుఁ బాటలి
పొగడ పొవ డన నొఽప్పును వకుళము

తే. మ్రాఁకు మ్రాను చెట్టనఁగ ద్రుఽమంబు చెలఁగుఁ
దీఁగ తీఁగియ లతకూన ఽ తీఁగె యనఁగఁ
దనరు లతపేరు పూవులు ఽ ననలు విరులు
పువ్వు లలరులు నా సుమంఽబు లగు సాంబ. 58

టీ. అత్తి, మేడి-౨ = ఉదుంబరము. మావి, మామిడి-౨ = ఆమ్రవృక్షము. వెలఁగ, వెలంగ-౨=కపిత్థము. మల్లె, మల్లియ-౨=మల్లిక. జాజి, జాది-౨ = జాతిపుష్పము. నేరేడు, నేరెడు-౨ = జంబూవృక్షము. పాదిరి, కలిగొట్టు-౨ = పాటలి. పొగడ, పొవడ-౨=వకుళము. మ్రాఁకు, మ్రాను, చెట్టు-౩=సామాన్యముగా వృక్షము. తీఁగ ॥రూ॥ తీవ, తీఁగియ ॥రూ॥ తీవియ, లతకూన (మిశ్రపదము), తీఁగె ॥రూ॥ తీవె-౩ =లత. పూవులు ॥రూ॥ పూలు, ననలు, విరులు, పువ్వులు ॥రూ॥ పువులు, అలరులు-౭=పుష్పములు.

సీ. మొక్క మోటిక మోసు ఽ మోక మొలక యన
నంకురనామంబు ఽ లలరు నిగురు
తలిరు చిగురు నాఁగఁ ఽ దగుఁ బల్లవాఖ్యలు
కొన తుద యన నగ్రఽమునకుఁ బొల్చుఁ

దొఱ తొలి తొఱ్ఱి నాఁ దరుకోటరం బొప్పుఁ
దమ్మి తామ రనఁ గంజమ్ము పరఁగుఁ
దొగ తొవ కలు వనఁ దగు నుత్పలమునకు
దట్టంబు జొంపంబు తఱుచు జీబు
తే. గుమురు తంపర యన నిబిడము దనర్చు
మొగడ మొగ్గ యనం దగు ముకుళమునకు
నిక్షుకాండంబునకుఁ బేరు లెసఁగుఁ జెఱకు
కనులుగలమ్రాను తియ్యమ్రా ననఁగ సాంబ. 59

టీ. మొక్క, మోటిక ॥రూ॥ మొట్టిక, మొటిక, మోసు, మోక, మొలక-౭=అంకురము. ఇగురు, తలిరు, చిగురు ॥రూ॥ చివురు-౪ = పల్లవము. కొన, తుద-౨=అగ్రము. తొఱ, తొలి, తొఱ్ఱి-౩=వృక్షకోటరము. తమ్మి, తామర-౨ = తామరసము. తొగ, తొవ, కలువ - ౩=ఉత్పలము. దట్టము, జొంపము, తఱుచు, జీబు, గుమురు ॥రూ॥ గుబురు, తంపర-౭=నిబిడము. మొగడ, మొగ్గ-౨=ముకుళము. చెఱకు, కనులుగలమ్రాను, తియ్యమ్రాను-౩= ఇక్షుకాండము.

సీ. తెలుపు తెల్లన తెల్ల తెల వెల్ల వెలి యన
ధవళవర్ణ మెసఁగుఁ దొవరు తొగరు
కెంజాయ యెఱు పెఱ్ఱ కెంపన రక్తవ
ర్ణ మగు నల్లన కఱ నల్ల కప్పు
నలు పన నీలవర్ణము పొల్చుఁ జామన
పసరుచా యన శ్యామ మెసఁగుచుండు
నళిది పసు పనంగ నగుఁ బీతవర్ణంబు
తేట నున్నన నున్న తెలివి నునుపు
తే. నిద్ద మన స్నిగ్ధత కెసంగు నిగ్గు డాలు
మినుకు మిన మించు నిగ తళ్కు మెఱుఁగు చికిలి

కళుకు జిగి రంగు మెఱపనఁ బొలుచుఁ గాంతి
నొడ్డు దరి గట్టనఁగఁ గూల మొనరు సాంబ. 60

టీ. తెలుపు, తెల్లన, తెల్ల, తెలి, వెల్ల, వెలి-౬=ధవళవర్ణము. తొవరు, తొగరు, కెంజాయ (కెంపు+చాయ), ఎఱుపు, ఎఱ్ఱ, కెంపు-౬=రక్తవర్ణము. నల్లన, కఱి, నల్ల, కప్పు. నలుపు-౫ = నీలవర్ణము. చామన, పసరుచాయ-౨ = శ్యామవర్ణము. అఱిది, పసుపు - ౨=పీతవర్ణము. తేట, నున్నన, నున్న, తెలివి, నునుపు, నిద్దము (ప్ర. స్నిగ్ధము)-౬=స్నిగ్ధత. నిగ్గు, డాలు, మినుకు ॥రూ॥ మిన్కు, మిన, మించు, నిగ, తళుకు ॥రూ॥ తళ్కు, మెఱుఁగు, చికిలి, కళుకు, జిగి, రంగు, మెఱపు-౧౩ = కాంతి. ఒడ్డు, దరి, గట్టు-3=కూలము-తీరము.

సీ. ఆణి చినుకుఁబూస పాణి సుప్పాణి ము
    త్తెము ముత్తియంబు ముత్య మనఁ దనరు
మౌక్తికాఖ్యలు కెంపు మానికము రతన
    మనఁగ మాణిక్యాహ్వయంబు లలరుఁ
బగడము పవడం బనఁగ విద్రుమము పొల్చుఁ
    బక్కిరాయనితాయి పచ్చ యనఁగ
మరకతము దలిర్చు మగతాలు మూలతా
    లన వజ్రము లగుఁ బుష్యరాగంబు పుష్పరాగము తాయి
తే. కప్పుతాయి యనఁగ నీల మొప్పుఁ బిల్లు
పూరి చిగిరింత యేట్రింత పొనుఁగు గడ్డి
గఱిక పచ్చిక వెణుతురు కసవు తుంగ
విడవలి యనఁ దృణాఖ్యలు వెలయు సాంబ. 61

టీ. ఆణి, చినుకుఁబూస=స్వాతివర్ష బిందువుచేఁ బుట్టెడుపూస, పాణి, సుప్పాణి ॥రూ॥ సుపాణి, ముత్తెము, ముత్తియము, ముత్యము-౩=మౌక్తికము.

కెంపు, మానికము, రతనము (ప్ర. రత్నము) - 3 = మాణిక్యము. పగడము, పవడము-౨ = విద్రుమము. పక్కిరాయనిఱాయి, పచ్చ - ౨ = మరకతము. నగఱాలు, మూలఱాలు-౨ = వజ్రములు. పుల్లంటుఱాయి, కప్పుఱాయి-౨= నీలము. పిల్లు, పూరి, చిగిరింత, ఏట్రింత, పానుఁగు, గడ్డి, గఱిక, పచ్చిక, వెణుతురు, కసవు (ప్ర. ఘాసము), తుంగ, విడవలి - ౧౨=తృణభేదములు.

సీ. ఎల్లి చుట్టువు గొడు ౯ గెండమఱు వనంగ
 ఛత్రంబు దనరు ధ్వజంబు పేళ్లు
టెక్కెము టెక్కెము ౯ టెక్కియము సిడంబు
 పడగ, డా లనఁ జెల్లు ౯ నిడివి నిడుద
సోగ నిడుపు చాఁపు ౯ నాఁగ దీర్ఘమున కౌ
 మఱుఁగు చా టోలము ౯ నుఱు వనంగఁ
దగుఁ బిధానాఖ్యలు ౯ జగతి జగిలె తిన్నె
 యరుఁ గన వేదిక ౯ కమరు నేల

తే. యిల పుడమి మన్ను బువి పంటవలఁతి యనఁగ
ధరణి కగు విప్ప వెడలుపు ౯ విరివి పఱపు
వెడఁద యన విస్తరాఖ్యలు ౯ వెలయుఁ బైరు
ససి యనఁగ సస్యనామము ౯ లెసఁగు సాంబ. 62

టీ. ఎల్లి, చుట్టువు, గొడుగు, ఎండమఱువు-४ = ఛత్రము. టెక్కెము, టెక్కెము, టెక్కియము, సిడము, పడగ, (ప్ర. పతాక), డాలు-౬ = ధ్వజము. నిడివి, నిడుద, సోగ, నిడుపు, చాఁపు-౫ = దీర్ఘము. మఱుఁగు, చాటు, ఓలము, మఱువు-४ =పిధానము. జగతి, జగిలె ॥రూ॥ జగ్గిలె, తిన్నె ॥రూ॥ తిన్నియ, అరుఁగు ॥రూ॥ అరఁగు - 8 =వేదిక. నేల, ఇల, పుడమి (ప్ర. పృథివి), మన్ను, బువి, (ప్ర. భువి) పంటవలఁతి-౬ = భూమి. విప్పు, వెడలుపు, విరివి ॥రూ॥ విఱివి, పఱపు, వెడఁద-౬ = విస్తారము. పైరు, ససి-౨=సస్యము.

సీ. మోఁడు మొరడు మొద్దు ‡ మోటన స్థాణు వౌ
బొఱియ కలుఁగు బొక్క ‡ బొంద లోయ
యన బిలాఖ్యలు చెల్లు ‡ నడుసు బురద యొంపి
యస లనఁ బంకాఖ్య ‡ లెసఁగు మడుఁగు
మడు వన హ్రద మొప్పుఁ ‡ బొడవ నున్నతం
బగు గోడ యనఁగఁ గు‡డ్యంబు పొల్చు
సోరణగండ్లన ‡ మీఁడు గవాక్షము
మాడుగుల్ మిద్దెలు ‡ మచ్చు లనఁగ
తే. దారునిర్మితగృహము లౌఁ ‡ దరకసంబు
బత్తళిక పొది దొన యనఁ ‡ బరఁగుఁ దూణి
పెట్టి మందసమును బెట్టె ‡ పెట్టియ యనఁ
పేటికాభిఖ్య లగు గుణా‡పేటి సాంబ. 63

టీ. మోఁడు ॥రూ॥ మ్రోడు, మొరడు, మొద్దు, మోటు-౫=స్థాణువు. బొఱియ ॥రూ॥ బొఱ్ఱియ బొఱ్ఱె, కలుఁగు, బొక్క, బొంద, లోయ-౭ = బిలము. అడుసు, బురద, ఒంపి, అసలు-౪ = పంకము. మడుఁగు, మడువు-౨=హ్రదము. పొడవు ॥పా॥ పొడుగు - ౨=ఉన్నతము. గోడ = కుడ్యము. సోరణగండ్లు ॥రూ॥ సోర్ణగండ్లు-౨ = గవాక్షము. మాడుగులు ॥రూ॥ మాడువులు, మిద్దెలు, మచ్చులు-౪ = దారునిర్మితగృహములు. తరకసము, బత్తళిక, పొది, దొన-౪=తూణీరము. పెట్టి, మందసము, పెట్టె, పెట్టియ-౪ = పేటిక.

సీ. ఎన జోడు మాదిరి ‡ యీడు పురుడు మాద్రి
సాటి పాటి తరంబు ‡ దీటు దినుసు
సరి యుద్ది ప్రతి దిన్సు ‡ సవతు పోలిక దొర
జత యనఁగా సదృ‡శమున కెసఁగుఁ
బల్లకి పల్లకీ ‡ పాలకి పాల్కి నాఁ

బల్యంకికాఖ్యలు పరఁగు లాలి
యుయ్యాల యుయ్యేల యూయెల తొట్ల జో
ల యనంగ డోలికాహ్వాయము లెసఁగుఁ
తే. గంకటియు మంచ మనఁ జెల్లు ఖట్వమునకుఁ
బీఁట పలక యనఁగ నొప్పుఁ బీఠమునకు
బరణియుఁ గరాట మనుపేళ్లు భరణి కమరు
నిచ్చెన యనంగ నిశ్రేణి నెగడు సాంబ. 64

టీ. ఎన, జోడు, మాదిరి, ఈడు, పురుడు, మాద్రి, సాటి, పాటి, తరము, దీటు, దినుసు, సరి, ఉద్ది, ప్రతి, దిస్సు, సవతు, పోలిక, దొర, జత - ౧౯=సదృశము. పల్లకి, పల్లకీ, పాలకి, పాల్కి-౪=పల్యంకిక. లాలి, ఉయ్యాల ॥రూ॥ ఉయ్యాల, ఊయాల, ఊయల, ఉయాల, ఉయ్యేల ॥రూ॥ ఉయ్యెల, ఊయేల, ఊయెల, ॥రూ॥ ఉయేల, తొట్ల, జోల-౧౩=డోల. కంకటి, మంచము-౨=ఖట్వము. పీఁట, పలక-౨ = పీఠము. బరణి, కరాటము-౨ = భరణి. నిచ్చెన=నిశ్రేణి.

సీ. ఉలి యుక్కిను మనంగ నొనరు నయస్సంజ్ఞ
చెంబు రాగి యనఁ దామ్రమం బెసంగుఁ
దగరము కరుగు డనఁగ సీసము రహించుఁ
గాంస్యంబు వత్తిల్లుఁ గంచనంగఁ
ద్రపునామ మమరుఁ బెత్తళి యిత్తళి యనంగఁ
గుండులు చట్లు మూఁకుళ్లు బుడ్లు
కడవలు బానలు పిడతల్ వెస ళ్లన
భాండముల్ తగు నాఁచు పాఁచి యనఁగ
తే. శైవలం బగు నూతులు బావు లనఁగ
వెలయుఁ గూపంబులకు గుంట కొలను కొలఁకు

తిరుకొళం బన సరసికిఁ ౹ బరఁగు వాఁక
యేఱు వంక వాఁ గనఁ బేరు ౹ లెసఁగు సాంబ. 65

టీ. ఉలి, ఉక్కు, ఇనుము-౩ = అయస్సు. చెంబు (ఇది అఱవము), రాగి-౨=తామ్రము. తగరము, కరుగుడు-౨=సీసము. కంచు = కాంస్యము, పిత్తళి - ఇత్తళి ॥రూ॥ ఇత్తడి-౩=త్రపువు. కుండలు (సామాన్యముగా పాత్రము), చట్లు (నోరు వెడల్పుగానుండునవి) మూఁకుళ్లు (మూఁత పెట్టెడునవి), బుడ్లు (సన్ననినోరుకలిగి పొడుగుగా ఉండునవి), కడవలు (నీళ్లుతోఁడుబిందె), బానలు (చిన్ననోరు పెద్దకడుపును గలవి), పిడతలు (చిన్నగిండిచెంబువంటివి), వెసళ్లు (వండుటకుఁ దగినవి)-౮ = భాండములు. నాఁచు, పాఁచి ॥రూ॥ ప్రాఁచి-౩ = శైవలము. నూతులు, బావులు-౨=కూపములు. గుంట, కొలను, కొలఁకు, తిరుకొళము (ఇది అఱవపదము)-౪=సరస్సు. వాఁక, ఏఱు, వంక, వాఁగు-౪=నది.

సీ. మీల్ మీలు చేఁపలు ౹ మీనులు తెఱగంట్లు
మచ్చెము లనఁ జెల్లు ౹ మత్స్యములకుఁ
దాఁబేలు తామేలు ౹ నాఁ బొల్చుఁ గూర్మము
నెండ్రెండ్రకా యన ౹ నెసఁగుఁ గర్కి
యోడ కల మనంగ ౹ నోనరు నావకు వాన
జడి ముసు రనఁగ వర్షమున కలరు
వానఱాల్ వడగండ్లు ౹ నా నొప్పుఁ గరకలు
నిసు మన నిసు కన ౹ నిసు వనంగ
తే. మెఱయు సైకతనామముల్ ౹ కురుజు తేనె
పుట్టతేనియ పెరతేనె ౹ పువ్వుఁదేనె
జుంటితేనియ యనఁ దగు ౹ సుమరసంబు
శంబధరనుతసుగుణక౹దంబ సాంబ. 66

టీ. మీల్, మీలు, మీనులు (ఈమూఁటికి ఏకవచనము మీను), చేఁపలు, తెఱఁగంట్లు = అనిమిషములు, మచ్చెములు (ప్ర. మత్స్యములు). ౬=మత్స్యములు. తాఁబేలు, తాఁమేలు-౨ = కూర్మము. ఎండ్రి, ఎండ్రకాయ-౨=కర్కి. ఓడ, కలము-౨=నావ. వాన, జడి, ముసురు-౩=వర్షము. వానఱాలు, వడగండ్లు-౨=కరకలు. ఇసుము, ఇసుక, ఇసువు-౩=సికత. కురుజు తేనె, పుట్టతేనె, పెరతేనె. పువ్వుఁదేనె, జుంటితేనె-౫=పుష్పరసము.

సీ. జముకాణము తివాసి జంబుకాణ యనంగఁ
గంబళాఖ్య లగు బంగారు హొన్ను
జాళువా పుత్తడి మేలిమి బంగరు
పసిఁడి పొన్ను కడాని పైఁడి యుదిరి
యన సువర్ణము వొల్చు నపరంజి కుందనం
బనఁ దప్తకనక మౌఁ దునుక తునియ
చిదురుప చిదుర నాఁ జెల్లఁగు ఖండమునకుఁ
బొది ప్రోఁగు వామియుఁ బ్రోవు తిట్ట
తే. కుప్ప యన రాశి కగు సజ్జ యుప్పరిగయు
మహలు మేడ యనంగ హర్మ్య మగుఁ ద్రోవ
దారి తెన్ను తెరు వనఁ బథంబు వెలయు
రవ రజం బన లవముపేళ్ల వును సాంబ. 67

టీ. జముకాణము, తివాసి, జంబుకాణ-౩=కంబళము (రత్నకంబళి) బంగారు ॥రూ॥ బంగారము, హొన్ను, జాళువా ॥రూ॥ జాళ్వా, పుత్తడి ॥రూ॥ పుత్తళి, మేలిమి, బంగరు, పసిఁడి, పొన్ను, కడాని, పైఁడి ॥రూ॥ పయిఁడి, ఉదిరి-౧౫=సువర్ణము. అపరంజి, కుందనము-౨ = తప్తసువర్ణము. తునుక ॥రూ॥ తున్క, తునియ, చిదురుప ॥రూ॥ చిద్రుప, చిదుర-౬ = ఖండము. పొది, ప్రోఁగు ॥రూ॥ పోఁగు, వామి, ప్రోవు, తిట్ట, కుప్ప-౮=రాశి.

సజ్జ, ఉప్పరిగ, మహాలు (ఇది అన్యదేశ్యము.) మేడ-౫=హర్మ్యము. త్రోవ, దారి, తెన్ను, తెరువు ॥రూ॥ తెర్వు-౫=మార్గము. రవ, రజము-౨=లేశము.

సీ. అడవి కాన యనంగ నటవికిఁ దగు హసాను
తోఁట సింగారపుఁదోఁట నంద
వన మనంగను నుపవన మొప్పు నడబావి
డిగ్గియ దొరువు నన దీర్ఘిక తగుఁ
బవ్వళింపుబిడారు పడుకటి ల్లనఁ గేళి
గృహ మగు బోనపుటిల్లు వంట
యిల్లు సువారంపుటి ల్లనఁ బాకమం
దిరము రాజిలు దగతీర్పు చల్ల

తే. పంది లనఁ జలిపంది లోనం దనర్చు
సలిలశాలాభిధలు నీరుచల్ల నీరు
మజ్జిగయు జలతక్ర నామములు విసన
కఱ్ఱ వీవన యన వృంతక మగు సాంబ. 68

టీ. అడవి (ప్ర. అటవి.) కాన (ప్ర. కాననము) - ౨ = అరణ్యము. హసానుతోఁట, సింగారపుఁదోఁట, నందవనము-3 = ఉపవనము. నడబావి, డిగ్గియ ॥రూ॥ డిగియ-దిగ్గియ, దొరువు- ౫ = దీర్ఘిక. పవ్వళింపుబిడారు= శయనస్థానము, పడుకటిల్లు (పడుక+ఇల్లు)- ౨ = కేళిగృహము. బోనపుటిల్లు (బోనము+ఇల్లు)=అన్నగృహము, వంటయిల్లు. సువారపుటిల్లు-3 =పాకశాల. దగతీర్పు, చల్లపందిలి, చలిపందిలి-3 =పానీయశాల. నీరుచల్ల, నీరుమజ్జిగ-౨=జలతక్రము. విసనకఱ్ఱ, వీవన-౨=వృంతకము.

క. భువి నీస్థావరవర్గును
సవరణ వ్రాసినను వినినఁ జదివిన యమ్మా
నవులను విద్యామతివై

భవశాలులఁ గా నొనర్పు శ్రీ పశుపతి సాంబా. 69

తా. భూమిలో నీస్థావరవర్గను జక్కఁగా వ్రాసినను, వినినను, జది వినను, నట్లు చేయుమనుష్యులను బశుపతీ ! సాంబా ! విద్యాబుద్ధిసంపదలచే నొప్పువారినిగాఁ జేయుము.

స్థావరవర్గు - సంపూర్ణ ము.

---

## తి ర్య గ్వ ర్గ.

క. శ్రీగౌరీపతి నీపై
బా గౌరీతి రచియింతుఁ శ్రీ బటుకవితాధా
రాగతిఁ దిర్యగ్వర్గను
వేగమె నిగిడించి ప్రోవవే శ్రీసాంబా. 70

తా. శ్రీపార్వతీనాథా ! సాంబా ! నేను మంచి కవిత్వధారావైఖరి తోఁ జక్కనివిధమున నీకంకితముగాఁ దిర్యగ్వర్గను రచించెదను. దానిని శీఘ్రముగాఁ గొనసాగించి కావుమా.

సీ. నెఱసరి సింగంబు శ్రీ తెఱమొగము మెకంబు
మెకములదొర జడశ్రీమెకము బొబ్బ
మెకము నెడఁదనోటిశ్రీమెకము గుబ్బలిపట్టి
గుఱ్ఱి మేనుంగులశ్రీగొంగ యనఁగఁ
జెలఁగు సింహముపేళ్లు శ్రీ పులి చాఱలమెకంబు
తెరువుగాపరి పసిశ్రీతిండిపోతు
మువ్వన్నెమెక మనఁ శ్రీ బొలుపొందు వ్యాఘ్రంబు
వావురము పటాణి శ్రీ వారువంబు
తే. జక్కి మావు గుఱ్ఱము తేజి శ్రీ యెక్కిరింత

తత్తడి రవాలు నడగండు కత్తలాని
తురికి బాబా యనంగ నొప్పుం దురగమునకుం
గొమ్మనంగం దనరారు శృంగమ్ము సాంబ. 71

టీ. కేసరి, సింగము (ప్ర. సింహము), తెలి...మెకము - తెలుపగా (విశాలముగా) నుండు ముఖముగల మృగము - పంచాస్యము, మెక...దొర= మృగరాజు, జడమెకము=జటులు గలమృగము, బొబ్బమెకము = బొబ్బలువేయుమృగము, వెడందనోటిమెకము=విశాలమగునోరు గలమృగము, గుబ్బలిపట్టి గుఱ్ఱము=పార్వతివాహనము, ఏనుంగులగొంగ=ఏనుఁగులకు శత్రువు-౯=సింహము. పులి, చాఱలమెకము=చాఱికలు (రేఖలు) గల మృగము, తెరువుగాపరి= దారినిగాచుకొనియుండునది, పసి...పోతు = పశువులను భక్షించునది, ముఱ్ఱ న్నెమెకము = మూఁడువర్ణములు (నలుపు తెలుపు పసపు) గల మృగము - ౫ = వ్యాఘ్రము. వావురము, పటాణి, వారువము ॥రూ॥ వార్వము, జక్కి, మావు, గుఱ్ఱము, తేజీ ॥రూ॥ తేజి, ఎక్కిరింత ॥రూ॥ ఎకిరింత, తత్తడి, రవాలు, నడగండు, కత్తలాని ॥పా॥ కత్తళేండు, తురికి, బాబా-౧౭ = అశ్వము. కొమ్ము=శృంగము.

సీ. సిబ్బెమేనిమెకంబు గబ్బుచెంపమెకంబు
గొప్పయజ్జమెక మేకుకండుమెకంబు
గొరు చెయ్యిగలమేకము రెంటఁద్రాగు డే
నుఁగు పలుగొమ్ములుదగినమెకము
హత్తిబత్తులమెకం బన దంతిపేళ్లగుఁ
బుట్టకూటిమెకంబు బొచ్చుమెకము
వెనుచూపుమెక మెల్గు వెలినోటిమెక మన
భల్లూకనామముల్ పరఁగు గొరిజ
తే. గొరిసె యన ఖుర మమరును గొరనంగ

నఖము తగు జోడనలు రవనడలు నడ్డ
వేడెములు పర్వు లనఁ జుట్టు వేడెము లనఁ
బంచధారలనామముల్ పరఁగు సాంబ. 72

టీ. సిబ్బె...మెకము=సిబ్బెనులు (పొడలు) గలశరీరముతోఁ గూడిన మృగము. గబ్బు...మెకము = మదజలముకంపు గల చెక్కులతోఁ గూడిన మృగము, గొప్ప...మెకము=గొప్పయడుగు గలమృగము, ఎక్కుడుమెకము = మహామృగము, గౌరు ॥రూ॥ గవురు, చెయ్యిగలమెకము = తొండముగలమృగము-కరి, రెంటఁద్రాగుఁడు=రెంటిచే (అనఁగా తొండముచేతను నోటిచేతను) త్రాగునది-ద్విపము, ఏనుఁగు ॥పా॥ ఏనిక, పలు...మెకము=పండ్లే (అనఁగా దంతములే) కొమ్ములుగా నొప్పినమృగము, హత్తి (ప్ర. హస్తి), బల్తలమెకము=పెద్దతలగల మృగము-౧౩=గజము. పుట్ట...మెకము=పుట్టకూటిని (అనఁగా చీమగ్రుడ్లతోఁగలిసిన పుట్టమట్టిముద్దను) దినునట్టిమృగము, బొచ్చుమెకము=శరీరమెల్ల బొచ్చు దట్టముగాఁగలమృగము, వెను...మెకము=వెనుక చూపులుగలమృగము, ఎల్గు ॥రూ॥ ఎలుఁగు-ఎలువు, వెలి...మెకము = తెలుపైనమోరగలమృగము-౭ = భల్లూకము. గొరిజ, గొరిసె-౨ = ఖురము. గోరు-నఖము. జోడనలు=ధౌరితకము, రవనడలు=రవగాలు-ఆస్కందితము, అడ్డవేడెములు, పర్వులు, చుట్టువేడెములు-ఈ-౫=ను అశ్వపు పంచధారలు.

సీ. పసి గిడ్డి మొదవ వాన్రు పసరము త్రోడు కనఁ
　　బసువుపేళ్లగు గిబ్బి బసనఁ డాల
పోతు నాఁబోతు మూఁపురముదా ల్పెద్దు ము
　　క్కంటిమా వన వృషాఖ్యలు దనర్చుఁ
గోడె గిత్త యనంగఁ గొజలు నుక్షాఖ్యలు
　　క్రేపు పడ్డయు దూడ లేఁగ పెయ్యా
యన వత్సనామంబు లలరును నెనుపెంటి

బఱ్ఱె నా మహిషికిఁ ¦ బరఁగు దుంత
తే. దున్నపో తన మహిష మౌ ¦ దొడ్లు తొట్టి
పట్టు లనఁగ గో¦స్థానముల్ ¦ పరఁగు మంద
కదుపు పదు వనఁ జెలఁగు గో¦గణము పాగ
లాయ మన నొప్పు వాజిశా¦లకును సాంబ. 73

టీ. పసి, గిడ్డి, మొదవు, ఆవు, పసరము, తొడుకు-౬=పశువు. గిబ్బి, బసవఁడు, ఆలపోతు, ఆఁబోతు, మూఁపురముదాల్పు = కకుదము దాల్చినది, ఎద్దు, ముక్కంటిమావు=శివునిగుఱ్ఱము-౮=వృషభము. కోడె, గిత్త-౨=ఉక్షము. క్రేపు, పడ్డ, దూడ, లేఁగ, పెయ్య ॥రూ॥ పేయ-౬ = వత్సము. ఎనుపెంటి (ఎనుము+పెంటి), బఱ్ఱె-౨=మహిషి-గేదె. దుంత, దున్నపోతు-౨=మహిషము. దొడ్లు, తొట్టిపట్టులు-౨ = పసులకొట్టము. మంద, కదుపు, పదువు-3=గోసమూహము. పాగ ॥రూ॥ పాగా, లాయము-3=అశ్వశాల.

సీ. సింగంపుగొంగ ద¦చ్చియడుగులమెక మ
నఁగ శరభాఖ్య లౌఁ ¦ దగరు జంట
మొగము వేలుపు తేజి ¦ పొట్టేలు గొఱియపో
తేడిక యన మేష ¦ మెసఁగు నిఱ్ఱి
నులికొమ్ముమెక మన ¦ వెలయుఁ గృష్ణమృగంబు
జింక లే డన మృగి ¦ చెలఁగుఁ బిల్లి
చీలి యనంగ మా¦ర్జాల మౌఁ గుందేలు
చెవులపో తనఁగ రం¦జిలు శశంబు
తే. నొంటె లొట్టిపిట్ట యనఁగ ¦ నుష్ట్ర మమరుఁ
గణితి కణఁ జనఁ దనరు గో¦కర్ణమృగము
పిక్కమెక మెండ్రిమేఁతరి ¦ నక్క బుద్ధి
మెక మనఁగ జంబుకాఖ్యలు ¦ మెఱయు సాంబ. 74

టీ. సింగంపుగొంగ=సింహమునకువిరోధి, దచ్చి...మెకము=ఎనిమిది కాళ్లమృగము-౨ = శరభమృగము. తగరు, జంట...తేజి + రెండుముఖములు గలదేవుఁడగునగ్నికి వాహనము, పొట్టేలు॥రూ॥ పొట్టెలు, గొఱియపోతు ॥రూ॥ గొఱ్ఱియపోతు-గొఱ్ఱెపోతు, ఏడిక-౪=మేషము. ఇఱ్ఱి, నులి...మెకము=మెలి గానుండు కొమ్ములుగల మృగము-౨=కృష్ణమృగము (మగజింక). జింక, లేడి ॥రూ॥లేటి-౩=ఆఁడుజింక. పిల్లి, చీలి-౨=మార్జాలము. కుందేలు ॥రూ॥కుందె లు, చెవులపోతు-౩ = శశము. ఒంటె ॥రూ॥ఒంటియ, లొట్టిపిట్ట॥ రూ॥ లొట్టి పిట - లొటిపిట్టు-లొటిపిట ॥పా॥ లొట్టియ-లొట్టె-లొట్టెనుఁగు-౯ = ఉష్ట్రి ము. కణితి ॥రూ॥ కడితి, కణఁజు ॥రూ॥ కడఁజు-౪ = గోకర్ణమృగము. పిక్కు మెకము = వంచనగలమృగము-వంచకము. ఎండ్రిమేఁతరి=ఎండ్రకాయ లు ఆహారముగాఁ గలది, నక్క, బుద్ధిమెకము-౪=జంబుకము.

సీ. కొమ్మమెంకిమెకంబు ♦ తిమ్మఁడు వెకిరింత
    కోఁతి నాఁ గపిపేళ్లు ♦ కొలుచుండు
జల్లితోఁకమెకంబు ♦ సవరంపుమెక మనఁ
    జమరికిం జనుఁ బంది ♦ చప్పరింత
కొమ్ముకాఁ డూటమెకమ్ము ♦ వేఁపులమిత్తి
    ము స్తెలమేపరి ♦ మోటుమెకము
వాలుమెకంబు రోకబంటరి యొంటరి
    ముట్టెమెకము పీఁటవెట్టుమెకము
తే. ఏకలము గుర్గురిం తన ♦ నెసఁగు దంష్ట్రి
పొడమెకము దుప్పి యనఁ బొలుపడరు రామ
మృగము మనుఁబో తనఁగ ఋశ్యమృగము దనరు
బల్లి గౌళన ముసలికిఁ ♦ బరఁగు సాంబ.                                 75

టీ. కొమ్మ...మెకము = చెట్లకొమ్మలు వాసస్థానముగాఁ గలమృగ ము-శాఖామృగము, తిమ్మఁడు, వెకిరింత = వెక్కిరించునది, కోఁతి ॥రూ॥ క్రోఁ

తి-౫ = వానరము. జల్లితోఁకమెకము = వెండ్రుకలు కుచ్చుగా తోఁకయందుఁగలమృగము, సవరపుమెకము - ౨= చమరీమృగము. పంది, చప్పరింత= చప్పరించునది, కొమ్ముకాఁడు, ఊటమెకము = దృఢమైనమెకము, వేఁపులమిత్తి=కుక్కలనుజంపునది, ముస్తెలమేపరి=ముస్తలనుదినునట్టిది, మోటుమెకము-*మోటుపయోగింపఁబడు మృగము, వాలుమెకము = క్రూరమృగము, గోబంటురి, ఒంటురి, ముట్టెమెకము = ముట్టె గలమృగము, పీఁటవెట్టుమెకము = పాదుకొని కదలక కూర్చుండుమృగము, ఏకలము, గుర్గురింత = ఘుర్ఘురధ్వని సేయునది-౧౮ = పంది. పొడమెకము = మచ్చలుగలమృగము, దుప్పి-౨=రామమృగము. మనుఁబోతు=ఋశ్యమృగము. బల్లి, గౌళి-౨=బల్లి.

సీ. తోఁడేలు గొఱియలనూఁడున వృక మొప్పు
ముంగిస వెంట్రువ ముంగి యనఁగ
బభ్రువు తగుఁ గొక్కు పందికొక్కన మూషి
కకుఁ బొల్చు గాడిద గాలిగాఁడు
చలువగుఱ్ఱము రేవుజక్కి యన ఖరాఖ్య
లగు మొఱుఁగుడు జాగిలమ్ము కుక్క
వేఁపి నా శునకంబు వెలయును దొండ యూ
సరవెల్లి యనఁ దగు సరటమునకుఁ
తే. జిట్టెలుక యన బాలమూషికకుఁ బొల్చు
నుడుము తెల్ల మేపరి యన నొనరుచుండు
నవని గాధేరనామధేయములు మహిత
సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి. 76

టీ. తోఁడేలు ॥రూ॥ తోఁడెలు, గొఱియలనూడు = గొఱ్ఱెలకు శత్రు

---

* మోటు అనఁగా పందియెదుట మనుష్యాదిరూపముగా వేఁటకాండ్రు మఱుఁగుకై నిలిపెడు కపటలక్ష్యము.

వు-౨=వృకము. ముంగిస, వెంట్రువ, ముంగి - ౩=బభ్రువు. కొక్కు, పందికొక్కు-౨=మూషిక. గాడిద ॥రూ॥ గాడ్ద, గాలిగాఁడు, చలువగుఱ్ఱము=చాకలి చలువసేయువస్త్రములను మోయుగుఱ్ఱము, రేవుజక్కి=చాకలిరేవున నుండుగుఱ్ఱము (చాకలికి గుఱ్ఱమువలె నుపయోగించునదని భావము)-౫=ఖరము. మెఱుఁగుఁడు=మెఱుఁగునట్టిది, జాగిలము, కుక్క, వేఁపి-౪=శునకము. తొండ, ఊసరవెల్లి - ౨ = శరటము. చిట్టెలుక (చిఱు + ఎలుక)=బాలమూషిక. ఉడుము, త్రేళ్లమేసరి=త్రేళ్లను భక్షించునది-౨=గోధేరము.

సీ. తంతువాయ మగుఁ బాదట్టుపురువు సన్న
 పిల్లి సాలీఁ డన । రాళ్లరాసి
గాఁడు గరిమిడి యెల్క యన నాఖువు దగు
 నెఱకలు చట్టుపల్ । గఱులు ఱెక్క
లనఁ బక్షములు పొల్చు । లావు లీఁక లనంగఁ
 బర్ణంబు లగు గువ్వ । పక్కి పిట్ట
పులుఁ గనఁ బక్షికి । వెలయు మదికొలంకు
 పులుఁగు తెల్లనిపిట్ట । నలువ తేజి
తే. పాలు నీరును వెలిసేయు।పక్కి యంచ
యన మరాళంబు తగుఁ గెంపు।కనులపులుఁగు
తలిరుమేఁతరి సాఁకుడు।పులుఁగు మావి
కొమ్మయిలుపుల్గు కోవెల । కోయి లనఁగఁ
బరభృతమునామధేయముల్ । పరఁగు సాంబ. 77

టీ. పాదట్టుపురువు ॥రూ॥ పాదొట్టుపురువు= బూసిని గలిగించుపురువు, సన్నపిల్లి, సాలీఁడు - ౪ = తంతువాయము (సాలెపురుగు). రాళ్లరాసిగాఁడు, గరిమిడియెల్క-౨ = ఆఖువు (రాజమూషకము). ఎఱకలు, చట్టుపలు ॥రూ॥ చెట్టుపలు, గఱులు, ఱెక్కలు-౫=పక్షములు. లావులు, ఈఁ

13

కలు-౨=పర్ణములు. గువ్వ, పక్కి (ప్ర. పక్షి), పిట్ట, పులుఁగు-౮=పక్షి. మదికొలఁకుపులుఁగు = మానససరస్సుపక్షి, తెల్లనిపిట్ట=తెల్లనిపక్షి, నలువతేజి=బ్రహ్మవాహనము, పాలు నీరును వెలిసేయుపక్కి=క్షీరనీరముల వేఱుపఱుచుపక్షి, అంచ-౫=హంస. కెంపుకనులపులుఁగు=ఎఱ్ఱనికన్నులు గలపక్షి, తలిరుమేఁతరి = చిగురును భక్షించునది, సాఁకుడుపులుఁగు = అన్యపక్షులచేఁ బెంపఁబడినపక్షి - పరపుష్టము, మావి...పుల్గు=మామిడికొమ్మ వాసస్థానముగాఁ గల పక్షి, కోవెల, కోయిల-౬=కోకిల.

సీ. పచ్చఱెక్కలపుల్గు పచ్చవిల్తుని తేజి
పలుకులపులుఁగు నాఁ జిలుక చిల్క
యనఁగ శుకాభిఖ్య లగు బట్టికాఁడు గో
ర్వంక గోరింక గోరంక యనఁగ
శారికాహ్వాయము లేసంగు నట్టువపిట్ట
నెమ్మి జుట్టుఁబులుఁగు నెమిలి నమిలి
పురి విప్పియాడెడిపులుఁగు కన్నులు గల
పులుఁ గన బర్హి కి వెలయుచుండు
తే. జంటపిట్ట బటువుగువ్వ జక్కవ యనఁ
గోకనామంబు లగు మంచుగ్రోలుపుల్గు
నిప్పులను మ్రింగుపులుఁగు వెన్నెలపులుఁ గన
నమరును జకోరనామధేయములు సాంబ. 78

టీ. పచ్చఱెక్కలపుల్గు = పచ్చనిఱెక్కలు గలపక్షి, పచ్చవిల్తునితేజి=మన్మథునిగుఱ్ఱము, పలుకులపులుఁగు=మాటలు నేర్చుకొనుపక్షి, చిలుక, చిల్క-౫=శుకము. బట్టికాఁడు, గోర్వంక ॥రూ॥ గోరువంక, గొరువంక, గోరింక, గోరంక-౬=శారిక. నట్టువపిట్ట = నాట్యమాడుపక్షి, నెమ్మి ॥రూ॥ నమ్మి, జుట్టుఁబులుఁగు=తలయందు సిగ గలపక్షి-శిఖి, నెమిలి, నమిలి, పురివి

ప్పి యాడెడు పులుఁగు, కన్నులుఁగలపులుఁగు = పురులయందుఁ గన్నులవంటి యాకారములు గలిగియుండు పక్షి-౪=బర్హి. జంటపిట్ట=పోతును వెంటి యు జంటగా నుండుపక్షి, బటువుగువ్వ=గుండ్రనిపక్షి, జక్కవ-౩=చక్ర వాకము. మంచు గ్రోలుపుల్గు, నిప్పులను మ్రింగుపులుఁగు, వెన్నెలపులుఁగు-౩=చకోరము.

సీ. విరితేనెత్రావుడు ౯ మరునల్లె బమిపుర్వు
తుమ్మెద తేఁటి ముద్దుగలకాళ్ల
పురుగన భ్రమరంబు ౯ పొలుచు లకోరీలు
బకదారు లొడ్డీలు ౯ పల్లటీలు
పావురములు నేల౯పల్లటీల్ కూకీలు
పావురా లంతర౯పల్లటీలు
నురటీ లనంగఁ బొ౯ల్చును గలరవములు
కొక్కెర కొంచయుఁ ౯ గొక్కరాయి

తే. యనఁగఁ గ్రౌంచాఖ్య లగుఁ గొంగ ౯ యన బకంబు
జాలె జలకట్టె యణుజు వేసడము లగుడు
జావడము వారణము బైరి ౯ సాళునంబు
కనిసెరము చెంచడము డేగ ౯ యనఁగఁ దనరు
శ్యేనమునకు మునీశ్వరా౯ధీన సాంబ. 79

టీ. విరితేనెత్రావుడు=మకరందమును గ్రోలునది - మధుపము, మరు నల్లె=మన్మథుని యల్లెత్రాడు, బమిపుర్వు=భ్రమరము, తుమ్మెద, తేఁటి, ముద్దుగలకాళ్లపురుగు = (౩ × ౨) ఆఱుకాళ్లపురుగు - షట్పదము-౬ = భ్ర మరము. లకోరీలు, బకదారులు, ఒడ్డీలు, పల్లటీలు, పావురములు, నేలపల్ల టీలు, కూకీలు, పావురాలు, అంతరపల్లటీలు, నురటీలు-౧౦=పారావతములు (పారావతభేదములపేళ్లుగా గ్రహింపఁదగును). కొక్కెర, కొంచ, కొక్కరా

యి-3=క్రౌంచపక్షి. కొంగ=బకము. జాలె ॥రూ॥ జాలియ, జలకట్టె ॥రూ॥ జలకట్టియ ॥పా॥ నెలకట్టె, అణ్ణాజు, ॥రూ॥ అడుజు, వేసడము, లగుడు, జావడము, వారణము, బైరి ॥రూ॥ బయిరి, సాళువము ॥రూ॥ సాళ్వము, కనికెరము, చెంచడము, డేగ - ౧౮=శ్యేన(భేద)ములు.

సీ. కరువలిమేఁతరి కంటివిన్కరి పాము
పుట్టకాఁపరి త్రాఁచు చుట్టపురుగు
విసముతాలుపు చిల్వ బుసపుర్వు నాభోగి
వెలయుఁ జిలువఱేఁడు వెన్నుపాన్పు
తడవులనిడుపఁడు తరిగట్టుత్రాఁడన
నహిపతి కగు నజ్జ యలుగుపులుఁగు
కోడి పుంజన నొప్పుఁ గుక్కుటనామముల్
గుడ్లగూబ పగటిగ్రుడ్డి గూబ
తే. యనఁగ ఘూకాభిధానంబు లగు లకుముకి
మీనవల్లంకి పొదలిక మీలగొంగ
యనఁగఁ జను నర్తికకుఁ బేరు లమరు దివ్వె
యార్పు మిడు తన శలభాఖ్య లమరు సాంబ. 80

టీ. కరువలిమేఁతరి = వాయువును భక్షించునది-పవనాశనము, కంటివిన్కరి=కన్నులచే వినునది-చక్షుశ్శ్రవము, పుట్టకాఁపరి=వల్మీకమున వసించునది, త్రాఁచు, చుట్టపురుగు=చుట్టగా చుట్టుకొను పురుగు-చక్రి, విసముతాలుపు=విషమును ధరించునది-విషధరము, చిల్వ ॥రూ॥ చిలువ=విషము గల నోరు గలది, బుసపుర్వు=బుసకొట్టుపురుగు-౯=సర్పము. చిలువఱేఁడు=సర్పములరాజు, వెన్నుపాన్పు=విష్ణువుపడుక, తడవులనిడుపఁడు = చిరకాలముగా నుండునది, తరిగట్టుత్రాడు = మందరపర్వతమునకు సముద్రమథనకాలమున కవ్వపుఁద్రాడుగాఁ గట్టఁబడినది-౪=ఆదిశేషుఁడు. అజ్జ...పులుఁగు = పాదములే ఆయుధముగాఁగలపక్షి-చరణాయుధము, కోడి, పుంజు-3=కుక్కుటము.

గుడ్లగూబ, పగటిగ్రుడ్డి=దివాంధము,గూబ-3=ఘూకము. లకుముకి,మీనవల్లంకి ॥రూ॥ మీనవల్లిక, పొదలిక, మీలగొంగ = చేఁపలవిరోధి-४=వర్త్రిక, దివె యార్పు=దీపముల నార్పునది, మిడుత-౧=శలభము.

సీ. కాటుకపిట్ట కూఁకటిగువ్వ యేట్రింత
  పులుఁగులగదుమరి పోలిగాఁడు
నాఁగ భరద్వాజనామముల్ తగు గబ్బి
  లము గబ్బిడా గబ్బిలాయి చీకు
రా యనంగను దైలపాయికాఖ్యలు చెల్లు
  ప్రమానుదొలుచుపిట్ట ప్రమానిపోటు
వనఁగ దార్వాఘాటమున కగు బెగ్గుర
  మన సారసమ్మున కలరు నీరు
తే. కట్టె నీరుపా మన నలగర్ద మలగుఁ
బుడమిచెవి పాములబిడారు పుట్ట యనఁగ
మించు వల్మీకనామముల్ మెట్టు తాప
మెట్టిక యన సోపానాఖ్య మెఱయు సాంబ. 81

టీ. కాటుకపిట్ట, కూఁకటిగువ్వ, ఏట్రింత, పులుఁగులగదుమరి = పక్షులను గదుమునది, పోలిగాఁడు ॥రూ॥ పోలఁడు-౬=భారద్వాజము. గబ్బిలము, గబ్బిడా ॥రూ॥ గబ్బిడాయి, గబ్బిలాయి, చీకురాయి ॥రూ॥ చీకురువాయి, ౬=తైలపాయిక. ప్రమానుదొలుచుపిట్ట, ప్రమానిపోటువు-౨ = దార్వాఘాటము (వడ్రంగిపిట్ట). బెగ్గురము = సారసపక్షి. నీరుకట్టె ॥రూ॥ నీరుకట్టియ, నీరుపాము-3=అలగర్దము. పుడమిచెవి = భూమికర్ణము, పాములబిడారు = సర్పములస్థానము, పుట్ట-3=వల్మీకము. మెట్టు ॥పా॥ మెటిక, తాప, మెట్టిక-४=సోపానము.

సీ. గుమికాఁడు కాకి నాఁ గొఱలుఁ గాకముపేళ్లు

గ్రద్ద యనంగ గృధ్రంబు వెలయు
జరగు గుబ్బిలికాఁడు సకినాలు వెలయించు
పక్కి పగటిచీకు పైఁడికంటి
యనఁ గనకాక్షికిఁ దనరు జవాది జ
వ్వాజి యనఁగ సాంకవము దనర్చు
కస్తూరి వీణియ కస్తురి యనఁ బొల్చు
మృగనాభి చట్టపుమెకము పునుఁగుఁ
**తే.** బిల్లి యొత్తెడుపిల్లి నాఁ బేళ్లు వెలయు
గంధిలమునకుఁ జాతకాఖ్యలు దనర్చు
వానకోయిల మబ్బునీరానుపిట్ట
యనఁగఁ గైలాసశైలవిహార సాంబ. 82

టీ. గుమికాఁడు, కాకి-౨=కాకము. గ్రద్ద ॥రూ॥ గద్ద (ప్ర. గృధ్రము)-౨=గృధ్రము. గుబ్బిలికాఁడు ॥రూ॥ గుబిలి, సకినాలు...పక్కి = శకునములను దెలుపుపక్షి, పగటిచీకు=పగటిపూఁట గ్రుడ్డిగానుండునది, పైఁడికంటి=బంగరు వన్నెకనులు గలది-౫=కనకాక్షి. జవాది ॥రూ॥ జవ్వాది, జవ్వాదు, జవ్వాజి ౹౹రూ॥ జవాజి-౫=సంకుమదము. కస్తూరి (ప్ర. కస్తూరీ) వీణియ ॥రూ॥ వీణె, కస్తురి-౮=మృగనాభి. చట్టపు మెకము=పునుఁగుచట్టము గలమృగము, పునుఁగుఁ ల్లి (పునుఁగు+పిల్లి), ఒత్తెడుపిల్లి-౩=గంధిలము. వానకోయిల, మబ్బు... పిట్ట=మేఘుజలమును ద్రావుపక్షి-౨=చాతకము.

**సీ.** పొడకోడి కానపుం జడవిపుం జన వన
కుక్కుటం బన బొల్లికోడి నీరు
కోడి యనఁగ జలకుక్కుటంబు దలిర్చుఁ
బిట్ట పిచ్చిక యూరబిచ్చిక యనఁ
దగుఁ జటకమున కొ దాఁటరి చలికాపు

కప్ప యనఁగ భేకకె మొప్ప జలగ
నల్లత్రాగు డన రాకెజిల్లు జలూకము
మొగటిపురువు గోడకెపురువు నల్లి
తే. నాఁగ మత్కుణ మగు నీవ కె యీఁగ యనఁగ
మక్షికకు నెప్ప ములుపుర్వు కె మంటితిండి
తే లనఁగ వృశ్చికంబు వకె ర్తిల్లు ఱొచ్చు
పురుగు దోమన మశకంబు కె పరఁగు సాంబ. 83

టీ. పొడకోడి, కానపుంజు, అడవిపుంజు-3 = వనకుక్కుటము. బొల్లి కోడి, నీరుకోడి-౨=జలకుక్కుటము. పిట్ట, పిచ్చిక ॥రూ॥ పిచ్చుక, ఊరఁబిచ్చిక (ఊరఁ+పిచ్చిక)- ౪ = చటకము. దాఁటరి = గంతులు వేసి చరించునది - ప్లవము, చలికాపు=చలికాలమున (అనఁగా వర్షాకాలమున) కలుగునది - వర్షాభువు, కప్ప-3=మండూకము. జలగ, నల్లత్రాగుడు=నెత్తురు పీల్చునది-౨ = జలూకము. మొగటిపురువు, గోడపురువు, నల్లి-3=మత్కుణము. ఈవ, ఈఁగ-౨=మక్షిక. ములుపుర్వు = కొండి గలపురుఁగు, మంటితిండి=మన్ను దినునది, తేలు-3 =వృశ్చికము. ఱొచ్చుపురుగు, దోమ-౨=మశకము.

క. ప్రీతిని భవదంకిత మా
నీతిర్యగ్వర్గు జగము కె లెన్నఁగ లోకా
తీతం బై పూతం బై
ఖ్యాతం బై ధరను వెలయుఁకెగావుత సాంబా. 84

తా. సాంబమూర్తీ! ప్రీతి గలుగునట్లు నీ కంకితము సేయఁబడినయీ తిర్యగ్వర్గు, జనము లెన్నఁగా లోకోత్తరమైనదియుఁ బవిత్రమైనదియుఁ బ్రసిద్ధి చెందినదియు నై భూమియందు విలసిల్లునుగాత.

తిర్యగ్వర్గు సంపూర్ణము.

---

## నానార్థవర్గు.

క. శ్రీనాయకసాయక వా
ణీనాయకముఖ్యవినుత నీపేరిట నే
నానార్థవర్గుఁ జేసెద
నానార్థము లొసఁగి ప్రోవు ననుఁ గృప సాంబా. 85

తా. లక్ష్మీనాథుఁ డగువిష్ణుని బాణముఁగాఁ గలవాఁడా! బ్రహ్మ మొదలగు వారిచే స్తోత్రము చేయఁబడువాఁడా! సాంబమూర్తీ! నేను నీ కంకితముగా నానార్థవర్గును రచించెదను. నాకు ననేకార్థముల నిచ్చి రక్షింపుము.

సీ. గుణమున కాటకుఁ గోపు నా విలసిల్లు
గోతికి శాఖ కౌఁ గొమ్మ యనఁగ
శకలంబునకును మాటకుఁ బలు కన మించు
నిసువును గోవు నాఁ బసి యనంగఁ
గటికిఁ బై పూరికిఁ గప్పనఁ జెన్నొందుఁ
గొఱ్ఱుకుఁ గడమ కౌఁ గొఱఁత యనఁగ
మగగుఱ్ఱమునకు గుల్మమున కౌ గుం డన
నెలకు జాబిల్లి కౌ నెల యనంగ
తే. నూటకును జేవకుఁ దనర్చు నూట యనఁగ
వేఁడుటకుఁ గాఁకకుఁ దలిర్చు వేఁడి యనఁగ
నంకమునకు బిడ్డకును గం దనఁగఁ బరఁగు
లలితమునిమానసాబ్జరోలంబ సాంబ. 86

టీ. 1. కోపు=గుణము (అల్లెత్రాడు), ఆట. 2. కొమ్మ=స్త్రీ, చెట్టుకొమ్మ. 3. పలుకు = శకలము (తునుక), మాట. 4. పసి=నిసువు, గోవు. 5. కప్పు=కటి (నలుపు), ఇంటిమీఁదిపూరి. 6. కొఱఁత=కొఱ్ఱు (ఉరి), తక్కువ.

7. గుండు = మగగుఱ్ఱము, గుల్మము. 8. నెల = చంద్రుఁడు, మాసము. 9. ఊట = ఊరెడునీరు, చేప. 10. వేఁడి=ప్రార్థించి(వేఁడుధాతువుక్త్వార్థకము), కాఁక [ఉష్ణము]. 11. కందు = కళంకము, బిడ్డ.

సీ. ఈఁతచెట్టును లోఁతు కే నీఁత యనఁ జెలంగు
నజ్జకుఁ గ్రింది కౌకే నడుగనంగ
మాల్మికి నడత కికే మ్మగు నలవాటన
నమ్మకు నవ్వ కౌకే నవ్వ యనఁగ
గొడుగును మఱునాఁడు కే నడరు నెల్లి యనంగ
నెట్టికుఁ దిండి కౌకే నెర యనంగ
విరికి నొప్పుటకును కే వెలయు నల రనంగఁ
బేరును దండ యౌఁ కే బే రనంగ
తే. నది యనుటకు భంగమున కౌకే నల యనంగ
నాత్రమునకు వృత్తమున కౌకే నక్కఱ యన
నాలమునకుఁ బలుకుట కౌకే నని యనంగ
నంబరధునీలసజ్జటాడంబ సాంబ. 87

టీ. 1. ఈఁత=ఈఁతచెట్టు, లోఁతు. 2. అడుగు = పాదము, క్రిందు. 3. అలవాటు=మాలిమి [మచ్చిక], నడత. 4. అవ్వ=అమ్మ [తల్లి], అవ్వ [తల్లి తల్లి].5. ఎల్లి=గొడుగు, మఱునాఁడు. 6. ఎర =ఆహారము, ఎఱ=ఎట్టి. 7. అల రు=పువ్వు, ఒప్పునునుట [క్రియ]. 8. పేరు =నామము, దండ[సరము]. 9. అల= అది యనుట, తరంగము. 10. అక్కఱ = ఆతురము, అక్కర=ఒకఛందోవృత్తము. 11. అని=యుద్ధము, పలికి [క్రియ].

సీ. ములికికిఁ జెఱువుకోకపునకు న ల్లనఁ బొల్చు
నైదును దాను నే కే నన రహించుఁ
జెవిసొమ్మునకును దంతువుకుఁ బోఁ గనఁ జెలుఁ

బురిటికి సాటికిఁ ꟃ బురు డనఁ దగు
నడవికిఁ జూడమి ꟃ కగుఁ గాన యనఁ బొల్పుఁ
గల్లును తాయియుఁ ꟃ గ ల్లనంగఁ
గంచుకొమ్మనకు శృంగమున కొఁ గొ మ్మనఁ
బాఁచికి దొంగ కొ ꟃ నాఁ చనంగఁ
తే. గరువలికి దయ్యమునకు నా ꟃ గాలి యనఁగ
ఘటికయును దల్పుమల్కు నా ꟃ గడియ యనఁగ
నూటికిని మర్దనమున కొ ꟃ నూ ఱనంగఁ
జటులదైతేయమదశైలశంబ సాంబ. 88

టీ. 1. అల్గు ॥రూ॥ అలుఁగు = ములికి, చెఱువుకోపు. 2. ఏను=ఐదు, నేను. 3. పోఁగు=చెవిసొమ్ము, తంతువు. 4. పురుడు=జాతాశౌచము, సాటి. 5. కాన = అడవి, [ద్రుతాంతమైనపుడు] చూడ ననుట. 6. కల్లు = మద్యము, తాటి. 7. కొమ్ము=కొమ్ము అను కంచువాద్యము, ఎద్దులు మొదలైనవాని కొమ్ము. 8. సాఁచు = పాఁచి, దొంగ. 9. గాలి=కరువలి [వాయువు], దయ్యము. 10. గడియ=ఘటిక, తలుపుగడె. 11. నూఱు=శతము, సన్నెగంట మర్దించుట.

సీ. కడుపుగడ్డయుఁ దూఁను ꟃ నడరు బల్ల యనంగ
విఱివికి శయ్య కొఁ ꟃ బఱ పనంగఁ
గాముదికిని మ్రొక్కు ꟃ కగు వెన్నెల యనంగఁ
బగలును గంటు నొఁ ꟃ బగ లనంగ
నంగల్లు నొకపోఁగు ꟃ నగును బేఁట యనంగ
నెమిలికి మైత్రి కా ꟃ నెమ్మి యనఁగఁ
బసుపుతావికి వీథి ꟃ కెసఁగు వాడ యనంగఁ
జలికిని గాలి కా ꟃ వలి యనంగఁ

తే. బట్టునకుఁ గొ మ్మనుటకు నాఁ § బ ట్టనంగ
భేదమునకు మూలమున కౌ § వే ఱనంగ
ఫలమునకు వృద్ధునకుఁ దగుఁ § బం డనంగ
దాసహృదయకాసారకాదంబ సాంబ. 89

టీ. 1. బల్ల = కడుపులోనిగడ్డ, తూము. 2. పఱపు=విరివి, పడుక. 3. వెన్నెల=చంద్రిక, మ్రొక్కు. 4. పగలు = పగటిపూఁట, కంటు (విరోధము). 5. పేఁట = అంగళ్లు, పేఁటు=పోఁగు. 6. నెమ్మి = నెమిలి, మైత్రి. 7. వాడ=పసుపుతావి, వీథి. 8. వలి=చలి, గాలి. 9. పట్టు=దుకూలము (నామము), గ్రహించు [క్రియ.] 10. వేఱు = భేదము, వేరు = చెట్టుమూలము. 11. పండు=ఫలము, వృద్ధుఁడు.

సీ. సాముకూటమునకు § సరస కౌ గరిడి నా
సౌరును ములికి యాఁ § దీ రనంగ
హయశాలకును శాగ § కమరుఁ బాగా యన
మావి కామ్రమున కౌ § మావి యనఁగఁ
గాహళి కొక చెట్టు § కలరు * బూరుగ యన
ఝడితికి విరతి కౌ § వడి యనంగ
ఔన్నున కుపకృతి § కొనరు మేల్మి యనంగ
మురుగును సొగసు నా § మురు వనంగఁ
తే. గళుకునకుఁ గంపకోట కౌ § వెలుఁ గనంగ
మాను మనుటయుఁ దరువు నా § మా ననంగఁ
జేవడికిఁ బోలిక కెసఁగుఁ § గైవడి యన
డమరుశూలపాశాంకుశాడంబ సాంబ. 90

*వృక్షపరముగా 'బూరుగు' అనియు వాద్యపరముగా 'బూరగ' అనియు ప్రయోగములు కనఁబడుచున్నవి. కాన 'బూరుగ' అనురూపము మృగ్యము.

టీ. 1. గరిడి = సాముకూటము, సమీపము. 2. తీరు=సొరు [అందము], బాణము. 3. పాగా=అశ్వశాల, తలపాగ. 3. మావి=మావి [జరాయువు], మామిడిచెట్టు. 5. బూరుగ = బూరుగచెట్టు, ఊఁదెడి కాహళివాద్యము. 6. వడి=ఝడితి [వేగము], పద్యములందలియతి. 7. మేలిమి=బంగారు, ఉపకారము. 8. మురువు = చేతిమురుగు, సొగసు. 9. వెలుఁగు = కళుకు [కాంతి], వెలుగు = కంపకోట. 10. మాను=విడుచుట [క్రియ], మ్రాను [నామము]. 11. కైవడి=చేతివడి, పోలిక [అవ్యయము.]

సీ. ఘూకంబునకుఁ జెవి గూబ కౌ గూబన
 శిశువును బులియు నౌఁ జిఱుత యనఁగ
సంధ్యవార్చుటకు సంజకు సందె యనఁ బొల్చుఁ
 బక్షియుఁ దరువు నౌఁ బాల యనఁగ
నొకమ్రాఁకునకు వాతెఱకు మోవి యనఁ జెల్లు
 చుక్కయు బొట్టు నౌఁ జుక్క యనఁగఁ
గూరకు శ్వాసనకుఁ జెలంగు నూర్పన
 హెచ్చు నెక్కుటయు నౌ నెక్కు డనఁగఁ
తే. గుచమునకుఁ దల్పుచీలకు గుబ్బ యనఁగఁ
బక్కకును గుణపమున కౌ బడు గనంగ
దళసరికిఁ బర్ణమునకు నౌ దళ మనంగ
శంబరాంకకపర్దావలంబ సాంబ. 91

టీ. 1. గూబ=గుడ్లగూబ, చెవిగూబ [కర్ణమూలము]. 2. చిఱుత = శిశువు, చిఱుతపులి. 3. సందె = సంధ్యవార్చుట, సంధ్యాకాలము. 4. పాల= పాలపక్షి, పాలచెట్టు. 5. మోవి=ఒకానొకచెట్టు, పెదవి. 6. చుక్క=నక్షత్రము, నొసటిబొట్టు. 7. ఊర్పు=కూర, శ్వాసము. 8. ఎక్కుడు = హెచ్చు, ఎక్కుట. 9. గుబ్బ = కుచము [స్తనము], తలుపుచీల. 10. బడుగు = బక్క

(చిక్కనది), కుణపము [ఏనుఁగు]. 11. దళము [దేశ్యము] = దళసరి, [సంస్కృతము] ఆకు.

సీ. లేపన మెత్తకు లేపుటకుఁ దనర్చు
డాలనఁగాఁ గాంతి డాలుఁ బరఁగు
నాఁడనఁ దగు నాదినమునకు సీమకు
మించన జడలకు మీఱుట కగు
మోడి నా నల్కకుఁ బైఁడితునకకుఁ జెల్లు
బార యన బార యాఱు నొనరు
దండ నాఁ జెంతకు దామంబున కెసంగు
సరి యన దండకు సమమున కగుఁ
తే. దోర మనఁగను స్థూలము నోముదార
మనరు నా ఆఱు త్రిగయును నూఁగారు నగును
గ్రుడ్డనఁగ నండమున కంధకునకుఁ బొసఁగు
నంబరతరంగిణీజటాడంబ సాంబ.    92

టీ. 1. లేపు=మెత్త, లేపుట. 2. డాలు = కాంతి, డెక్కెము. 3. నాఁడు=ఆదినము, నాడు=సీమ [దేశము]. 4. మించు=మెఱుఁగుఁదీఁగె [నామము], మీఱుట [క్రియ]. 5. మోడి = కోపము, బంగారుతునుక. 6. బార=వ్యామప్రమాణము, పంద్రెండు. 7. దండ=చెంత, పుష్పాదులదండ. 8. సరి= దండ, సమము. 9.తోరము=స్థూలమైనది, నోముదారము.10.ఆఱు=షట్సంఖ్య. ఆరు=నూఁగారు. . 11గ్రుడ్డు=కోడిమొదలైనవానిగ్రుడ్డు, గ్రుడ్డివాఁడు.

సీ. కొప్పనంగను వింటికొనకును గబరి కౌ
నెన్ను నా నెన్నున కెన్నుట కగు
నబ్బనంగను దండ్రి కగపడమికిఁ జెల్లు
నప్ప యనఁగఁ దండ్రి కక్క కమరుఁ

గలు పన మడిలోనికసవును బెరుఁగు నా
బా సన నానకు భాష కలరు
డ బ్బన గవ్వకు డంబంబునకుఁ బొల్చు
మే లన మరులుకు మెచ్చున కగుఁ
తే. బా లగును క్షీరమునకును భాగ్యమునకుఁ
గమ్మ యనఁ బత్త్రికకుఁ జెవికమ్మ కెనయుఁ
బాప యన బిడ్డకును గనుఁబాప కెనయుఁ
దాపసోత్తమవినుతికదంబ సాంబ. 93

టీ. 1. కొప్పు = వింటికొన, కబరి. 2. ఎన్ను = సస్యాదులయెన్ను [నామము], గణించుట [క్రియ]. 3. అబ్బ = తండ్రి. అబ్బుట = దొరకను. 4. అప్ప=తండ్రి, అక్క. 5. కలుపు= మడిలోనికసవు, పెరుఁగు. 6. బాస=ఆన, భాష. 7. డబ్బు=గవ్వ, డంబము. 8. మేలు = మరులు, మెచ్చు తెలుపుట. ॥పా॥ తా డన రజ్జువుఁ దాళముఁ దగు - తాడు = దారము, తాటిచెట్టు]. 9. పాలు =క్షీరము, భాగము. 10. కమ్మ=జాబు, చెవికమ్మ. 11. పాప=బిడ్డ, కనుఁబాప.

సీ. పెర యనఁగాఁ దేనెపెరకు వింతకుఁ బొల్చు
మెఱుఁ గనఁ గాంతికి మించున కగు
బండ నాఁ దిట్టుకు బలుఁగుఱాతికిఁ జెల్లు
బంతి నాఁ జెండును బంక్తియు నగుఁ
బెరుఁ గన దధికిని వృద్ధికిఁ దనరారు
వేఁట నా గొఱియకు వేఁట కమరు
వెలి యన బయటికి వెల్లనకుఁ దనర్చు
వీ డన వదలును వీడు నలరు
తే. మ బ్బనఁగ మందుచొక్కును మబ్బును నగుఁ

బులు గనఁగ లాంఛనమునకుఁ గ్రే బులుఁగు కొదవు
నా లనఁగ గోవులకు భార్య క్రే కతిశయిల్లు
శంబరాహితనుదభిదాకడంబ సాంబ. 94

టీ. 1. పెర=తేనెతెట్ట, పెఱ=అన్యము. 2. మెఱుఁగు=కాంతి, మెఱుపు. 3. బండ=తిట్టు, పలుఁగుఱాయి. 4. బంతి = చెండు, పంక్తి. 5. పెరుఁగు = దధి [నామము], పెరుఁగుట [క్రియ]. 6. వేఁట=గొఱ్ఱె, వేఁట [మృగయ]. 7. వెలి=బయలు, తెల్లన. 8. వీడు=వదలు [క్రియ], పట్టణము [నామము]. 9. మబ్బు=మందుచొక్కు, మేఘము. 10. పులుగు = గుఱుతు. పులుఁగు = పక్షి. 11. ఆలు=ఆవులు [బహువచనము], భార్య [ఏకవచనము].

అవతారిక. ఈక్రింది యొక పద్యమున సంస్కృతాంధ్రములు రెండునై నానార్థములు గలపదములను గొన్నిటిని దెలుపుచున్నాఁడు.—

సీ. గురు వన నొజ్జకుఁ గ్రే బరవునకుఁ జెలంగు
నారి నా నల్లెకు క్రే నాతి కెనయు
నూ రనఁ బల్లెకు క్రే నూరువునకుఁ బొల్చుఁ
దమి యన రాత్రికిఁ గ్రే దమికి నమరుఁ
గరి యన దంతికిఁ గ్రే గప్పునకుఁ దనర్చుఁ
జింత నాఁ దింత్రిణి క్రే చింత యొనరు
మూల యనఁగఁ గోణకమునకు రిక్కకుఁ జెల్లు
మను వన బ్రతుకును క్రే మనువును నగుఁ
తే. గూట మన శిఖరమునకు క్రే గుంపున కగు
జాతి యన నన్వయమునకు క్రే జాతి కెనయుఁ
బురి యనఁగ నెమ్మితోఁకకుఁ గ్రే బురికిఁ దనరు
సకలసురచక్రవర్తి శ్రీసాంబమూర్తి. 95

టీ. గురువు, ఇది (సంస్కృతమైనపుడు) ఉపాధ్యాయునకును, [తెనుఁగైనపుడు] పరువునకును పేరు. నారి = [సం] స్త్రీ. [తె] అల్లెత్రాఁడు, ఊరు [తె] పల్లె. [సం] తొడ. తమి = [సం] రాత్రి, [తె] తమకము. కరి= [సం] ఏనుఁగు, [తెనుఁగున శకటరేఫయుక్తమైనపుడు] నలుపు. చింత = [తె] చింతచెట్టు, [సం] విచారము. మూల = [తె] కోణము, [సం] మూలానక్షత్రము. మనువు = [తె] బ్రతుకు, [సం] వైవస్వతాదులగు పదునలుగురికిఁ గలసామాన్యనామము. కూటము = [సం] పర్వతశిఖరము, [తె] గుంపు. జాతి = (తె) కులము, (సం) జాజిపువ్వు. పురి=(తె) నెమిలితోఁక, (సం) పట్టణము.

క. నిస్తులలక్షణకవి యగు
కస్తూరీరంగసుకవి ఘటియించిన యీ
ప్రస్తగు నాంధ్రనిఘంటు ప్ర
శస్తం బై వెలయుఁగాక జగతిని సాంబా. 96

సాంబమూర్తీ! అసమానుఁడై లాక్షణికవేత్త యగు కస్తూరిరంగకవివరుఁడు రచించిన యీ మేలైన తెనుఁగునిఘంటువు ప్రఖ్యాతిచెందినదై జగమునందు విలసిల్లునుగాక.

క. ఈరుచిరాంధ్రనిఘంటు మ
హోరూఢి వహించి మించి యారవిశశిభూ
తారక మై తారక మై
తారక మాఁ గాత సుకవితతులకు సాంబా. 97

సాంబమూర్తి! మనోహరమైన యీ తెనుఁగు నిఘంటువు గొప్పయున్నతిని బొంది యతిశయించి సూర్యచంద్రభూనక్షత్రము లుండువఱకు నుండునదై సుందరమై కవిశ్రేష్ఠులసమూహములకుఁ దాను [పదార్థసందేహాదుల నుండి] దాఁటించునది యగును గాక.

సాంబనిఘంటువు

సమాప్తము.

---

శ్రీ ర స్తు.

# అకారాదిశబ్దానుక్రమణిక.

## ఆంధ్రనామసంగ్రహము.





14

# ఆంధ్రనామశేషము.

శ్రీరస్తు.

# సాంబనిఘంటువు

## అకారాదిశబ్దానుక్రమణిక.

పదము. పుట.

త్ర.



ద.



దా.



ది.



దీ.



దు.

స.





The India Printing Works, Madras.

# ఆనందాశ్రమగ్రంథరత్నమాల

తెనుఁగు పుస్తకముల వివరము

గ్రంథములకు వ్రాయునపుడు వానివెలయును తెలుపవలెను.

## శ్రీమద్భగవద్గీత

ప్రతిపదటీకా భాష్యవిశేషార్థ సహితము.

ఈ గ్రంథము మొదటి కూర్పునందు శ్రీరామానుజభాష్యము ననుసరించి టీకాతాత్పర్యములు కొంత సంగ్రహముగ వ్రాయఁబడినవి. భాష్యమును యథా మూలముగా తెనుఁగుచేసినచో మిక్కిలి యుపయుక్త మని యనేకులు కోరినందున భాష్యమునం దొక్క విషయమునైన విడువక అందలి ప్రమాణములకు ఆకరములతోను, కష్టములైన ప్రమాణములకు అర్థములతోను, భాష్యమునందు సందిగ్ధములైన విషయములకు తాత్పర్యచంద్రికనుండి విశేషముగా వివరణములతోను గూర్చి, తేటతెనుఁగున ఈ రెండవకూర్పును ముద్రించి యున్నారము.

| | | | |
|---|---|---|---|
| కాలికోబైండు గిల్టు పేరు గలది | 3 | 0 | 0 |

## శ్రీమదాంధ్ర మహాభారతము, పద్యకావ్యము

| | | | | |
|---|---|---|---|---|
| I. | ఆది సభాపర్వములు గల సంపుటము ... ... | 2 | 4 | 0 |
| II. | ఆరణ్యపర్వము ... ... ... | 2 | 4 | 0 |
| III. | విరాటోద్యోగపర్వములు ... ... ... | 2 | 4 | 0 |
| IV. | భీష్మద్రోణపర్వములు ... ... ... | 2 | 4 | 0 |
| V. | కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు ... ... | 2 | 4 | 0 |
| VI. | శాంతిపర్వము ... ... ... | 2 | 4 | 0 |
| VII. | అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు గల సంపుటము | 2 | 4 | 0 |

త్వరలో వెలువడును.

ఆంధ్రభాగవతము పోతనామాత్యప్రణీతము ఇదివరకు ముద్రితములైన ప్రతులకన్న బాగుగ ముద్రించుచున్నారము. సాదాగ్లేజు

| | | | |
|---|---|---|---|
| కాగితములు క్యాలికో బైండు ... ... | 6 | | |
| డిటో అత్యుత్తమప్రతి కాలికోబైండు గిల్టు పేరు క్యాలికోబైండు రెండు సంపుటములు ... | 8 | 0 | 0 |

